# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము ౧ మే : ౧౯౩౬ సంచిక ౧

సంపాదకవర్గము

గిడుగు వెంకటరామమూర్తిపంతులు

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి

తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి

తెలికిచర్ల వెంకటరత్నం

# విషయానుక్రమణిక



***

# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము ౧ : ధాత : వసంతసంచిక. : సంచిక ౧

## ప్రణామము

కొమాండూరి కృష్ణమాచార్యులు

శ్రీనివాసుండు నిగమైకసిద్ధుఁడేని
నిగమ వివరణ మితిహాసనిధుల దేని
జగతి తన్మూల పూర్వ వాక్సరణియేని
అదియ యగుఁగాక మత్ప్రణామార్హపదము.

ధరణి వాణీవిలాససౌధములనంగ
గ్రాలు కవితల్లజుల మహాకావ్యములకు
కారణంబయి పూర్వసంస్కారగరిమ
నెగడు ప్రతిభకు బ్రహ్మయు నగుఁగాత.

క్లేశకంటకరాగవల్మీకఘటిత
ఘోరసంసారవిషలతాగుల్మమునకుఁ
కావ్యమధుకోశ మొక్కండు గలదుగాని
విబుధుఁ డొక్కఁడ కాని సేవింపఁగలఁడు.

# ఆంధ్రవాఙ్మయం-పుట్టుపూర్వోత్తరాలు

కావ్యవ్యాకరణతీర్థ విద్వాన్ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు.

## కృతజ్ఞత

శ్రీః : రససిద్ధులకు సోదరసారస్వతులకు అభివాదనాలు. పురాణసారస్వతంలో గానీ నవ్యసారస్వతంలో గానీ సిద్ధహస్తులుగా మీలో అనేకులు ఉన్నారు. అట్టివారిని ఈ సమావేశాన్ని నడిపించడానికి అగ్రేసరులుగా నియమించక, చాలీచాలని నన్ను ఇందుకుగాను ఏర్పరిచారు. అది మీ అర్హతకు ఫలమో, లేక నాఅనర్హతకే ఫలమో, అనుపదమే తెలియగలదు. నేను ఆదేష్టను కాను. అనుచరపక్షానికి చెందినవాడిని; కనుక సిద్ధమైనాను. నవ్యసాహిత్యం ఈనాడు చాలా సందిగ్ధావస్థలో చిక్కి ఉన్నది. పురాణపంథాకుచెందిన మన జ్యేష్ఠసోదరులు సర్వదా మనలను ఆదరించి మనయత్నాలు ఎట్టివో అనిఅయినా ఆలోచించడానికి కూడా ఓపికలేని వ్యగ్రహృదయాలతో, అభారతీయం—అసంబద్ధం—అశ్లీలపూర్ణం—అని, పరిపరివిధాలుగా ఆక్షేపిస్తున్నారు. ఆవేశ పరవశులైన కనిష్ఠసోదరులు-పిన్నలుఅవడంచేతనే అయివుంటుంది—వషట్కారాలతో మనలను పూజిస్తున్నారు. మధ్యవర్తిత్వాన్ని వహింపవలసి నలోకం ఏదారీ తోచకుండా, కాలానుసారంగా, కొంతసేపు అటూ, మరికొంతసేపు ఇటూ, తలవూపుతున్నది. ఈమూడు తరగతులకూ చెందని అనామధేయులము కొంతమందిమి—మాలాంటివారం-కిందపడ్డవాడు మావాడని సోదరులను కయ్యానికి కదుపుతూ అభిమానిస్తున్నాము. ఇట్టి రొదలో నవ్యసాహిత్యస్రష్టలు తగుల్కొని మనస్సమాధిని పోగొట్టుకొనవలసి వస్తున్నది. మనవారట్టి దుస్థితికి పాల్పడకుండా ఉండేటట్టు చేయడానికి మన యీపరిషత్తు సమావేశం అవుతున్నది. మనం ధీరప్రకృతిని అవలంభింపగల్గితే, ఈవిక్షేపాలు మనకు ఏవిధమైనహానీ చేయలేవు. మనకు కావలసింది ఆస్థా స్వాస్థా. కాయేన వాచా మనసాఽపి అద్రోహబుద్ధులం అనే ఆత్మవిశ్వాసం మనకున్నప్పుడున్నూ, మనంచేసే ఈ యత్నాలు అనిర్వచనీయమైన సారస్వతక్షేత్రనిర్మాణానికి పునాదులు అనే దృఢమైన ప్రత్యయబుద్ధి మనకు ఉన్నప్పుడున్నూ, మన శక్తియుక్తులున్నూ మన పవిత్రభావనలున్నూ వినియోగింపక తప్ప

నవ్యసాహిత్య పరిషత్తు నాలుగోసమావేశములో చేసిన అధ్యక్షోపన్యాసము.

ననే దీక్షాపరాయణత మనకున్నప్పుడున్నూ, మనం తప్పక కృషిచేయవలసినదే. కాబట్టి మనలను ఈ విక్షేపాలు చలింపచేయలేవని నా మనవి. ఇంతేకాదు. ఈ విక్షేపశక్తులే మనలను మేల్కొల్పి ప్రమాదాలను సవరింపజేసుకోవడమునకు సాధనములుగా ఉపకరిస్తవి. కాబట్టి మీఅందరి అనుమతితో, ఇట్టిశక్తులనుపుట్టించి, మనలను కార్యనిరతులనుగాచేయ పూనుకొన్న వారికీ, మున్ముందు చేయతలంచుకొన్న వారికిన్నీ కృతజ్ఞతాభివందనాలు సమర్పిస్తున్నాను.

## న వ్య సా హి త్య ని ర్వ చ న ం

నవ్యసాహిత్య పరిషత్తుకు అధ్యక్షతవహించినప్పుడు ఆసాహిత్యనిర్వచనం చెయ్యవలసిన అవసరంకూడా చాల హెచ్చుగనే ఉంటుంది. అందుకు పూనుకుంటే, అంతకుపూర్వం ఉన్న సాహిత్యం-తత్స్వరూపం-నిరూపించి, ఆపిమ్మట-తద్భిన్నమైన నవ్యసాహిత్యాన్ని గురించి, చర్చించవలెనుగదా. ఇంతకార్యకలాపాన్ని పూనడం ఈ అల్పమైన కాలంలో,అల్పమైన ప్రజ్ఞానిర్వహణశక్తి గల నావంటివానికి అసాధ్యమైనకార్యం. పైగా, తీగ కదపడంతో తుప్పలన్నీ కదులుతవి. అట్లని త్రోసివెయ్యడంకూడా అనుచితమే! కాబట్టి సంగ్రహంగా ఆవిషయాన్ని కొంత చెప్పదలచాను.

## ఆంధ్రవాఙ్మయము-పుట్టుపూర్వోత్తరాలు

ఆంధ్రవాఙ్మయానికి పుట్టు పూర్వోత్తరాలు తెలిపే చరిత్ర గ్రంథాలు, ఇంతవరకూ చక్కనివి, ఆట్టే లేవు. ఉన్నవానిలో వావిళ్లవారు ప్రచురించిన ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహ మనేది కొంత మేలు. వారు కాలవిభాగాన్ని బట్టి ఆంధ్రవాఙ్మయమునకు చరిత్రను విభజించుకొని వ్రాశారు. అందులో మనవాఙ్మయాన్ని అయిదుఖండాలుగా విడదీసి చర్చించారు. మొదటిఖండం అజ్ఞాత యుగంలోని ప్రాచీన సాహిత్యాన్ని గురించినది. అది అనుమాన ప్రమాణగమ్యం కాబట్టి, మనకు గూడా అనుమానంలో అంతర్భావితం కావలసి వస్తుంది. రెండోఖండం పురాణకవిత్వాన్ని గూర్చి. క్రీస్తుశకం పదకొండో శతాబ్ది మొదలు 14 వ శతాబ్ది చివరదాకా ఇది వ్యాపిస్తుంది. దీనికి చాళుక్యచోడయుగం అని పేరు పెట్టారు వారు. మూడో ఖండం కావ్యప్రబంధకవిత్వాన్ని గూర్చినదిన్నీ, నాల్గోది అర్వాచీన కవిత్వాన్ని గూర్చిందిన్నీ అన్నారు. ఈ రెండుఖండాల వాఙ్మయమూ 14 వ శతాబ్ది మొదలు 19 వ శతాబ్ది ఆఖరువరకూ అని గీటు గీచారు.

కాని ఈనాల్గోది న్యాయానికి మూడో ఖండానికి అనుబంధమే కాబట్టిన్నీ, మొదటిది అనుమానాస్పదం కాబట్టిన్నీ, మనం పూర్వవాఙ్మయాన్ని పురాణయుగం ప్రబంధయుగం అని రెండు భాగాలుచేస్తే చాలు అంటారు కొందరు. నాభావం ఏమంటే పురాణాలు తెలుగులోనికి తర్జుమాలు చేసినా, లేక పురాణాల ఆధారాలమీద పెంచి ప్రబంధాలుగా మూటకట్టినా - ఫలితం ఒక్కవిధంగానే ఉంది కాబట్టిన్నీ, అదే మనకు ఇంతవరకూ ప్రాచీనమని చెప్పుకొనే వాఙ్మయం కాబట్టిన్నీ, దాన్ని పురాణసాహిత్యం అనే పేరుతో ఒక్కవిభాగంగా చెప్పితే సరిపోతుందంటాను. దీనివల్ల తేలినదేమిటంటే - క్రీస్తుశకం 11 వ శతాబ్ది మొదలుకొని 19 వ శతాబ్ది ఆఖరుదాకా ఉన్న సాహిత్యం పురాణసాహిత్యం అన్నమాట. ఆమాటకు పురాణాల సాహిత్యం అనండి, లేదా, ప్రాచీనసాహిత్యం అనండి. మీకు తోచిన పేరు ఏది పెట్టుకొన్నా పెట్టుకోవచ్చు. ఇల్లా పురాణసాహిత్యం నిర్వాచితం కాగానే-పరిశేష న్యాయంచేత- మిగిలినది నవ్యసాహిత్యం. అంటే పురాణసాహిత్యం కాని దంతా గాని, లేక, ఈ నవయుగంలో ప్రాదుర్భవిస్తూ ఉన్న సాహిత్యంగాని, నవ్యసాహిత్యంగా మనం అనుకోవచ్చు. ఇక ఈ సాహిత్యస్వరూపాలను పోల్చుకోడానికి మనం కొంత కృషి చేయాలి. ఆపని చేస్తాను శక్తిలోపం లేకుండా.

“దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్” అన్నాడు గురుజాడ అప్పారావు. దీని తాత్పర్యం ఆలోచిస్తే, వాఙ్మయం అన్నా, లేక సాహిత్యం అన్నా, ఆయాకాలాల్లో దేశాల్లో ఉండిన ప్రజలఉద్దేశాలూ ఆచారాలూ సంఘ వ్యవస్థలూ అభిరుచులూ మొదలయినవాటి నన్నిటినీ కాలగర్భంలో లీనమై పోనీయకుండా, వాటికి సారస్వతరూపమైన తేజస్సునుకూర్చి, శాశ్వతంగా అక్షరవిన్యాసంతో నెలకొల్పిన ఒక ఆకారమనిన్నీ, అది, ఏకాలంలో ఎవరు ఏమాత్రం ప్రజ్ఞకలవారైనప్పటికీచాలు, కదిపితే తన నిజస్వరూపాన్ని విస్పష్టంగా వెల్లడిచేయగలిగిన అలౌకికశక్తిత్వం కలిగిన ఒక దివ్యతేజః ప్రపూర్ణమైన విజ్ఞానరాశి అనిన్నీ, అవగతం అవుతుంది. కాబట్టి అది సాజాత్యవైజాత్యాలను స్ఫుటంగా వెల్లడించే సాధనంఅంటున్నాను.

## పురాణవాఙ్మయం

ఈదృష్టితో మనం పురాణవాఙ్మయాన్ని లేదా పురాణసారస్వతాన్ని, నవ్యవాఙ్మయాన్ని లేదా నవ్యసాహిత్యాన్ని, ఉపాసించవలసి ఉంటుంది. కాబట్టి ఉపాధ్యా

కాలపు పరిస్థితులను చూడాలి. ముందు పురాణవాఙ్మయాన్ని పరిశీలించుదాం. పదకొండో శతాబ్ది మొదలు పందొమ్మిదో శతాబ్ది చివరవరకూ, 900 వందల యేండ్లు ఈవాఙ్మయానికి ఆధారం. అందులో 2 వందల సంవత్సరాలు పూర్తిగా చోళరాజుల పరిపాలనం. తర్వాత ఇంచుమించు మరిరెండు వందల సంవత్సరాలు కాకతీయుల పాలనం, తర్వాత నూరేండ్లు రెడ్డినాయకులపాలనమూ కర్ణాటకరాజులపాలనమున్నూ, ఆపిమ్మట దాదాపు నూటయాభై ఏండ్లు రాయలపాలనమున్నూ, పిమ్మట మహమ్మదీయుల పాలనమూ ఆంధ్రదేశంలో వర్తించినవి. అంటే చోళులూ రెడ్లూ రాయలూ మహమ్మదీయులూ అనే నల్గురిపాలనం గల నాటిస్థితిగతులన్నిటిపైనీ మనం దృష్టి నిలిపి పురాణసాహిత్య స్వరూపం గమనించాలి. అయితే ఇది ఒక్కటీ మాత్రం గమనిస్తే చాలదు. దీనికి తోడు ఈపరిపాలనలు ఏ మత కేంద్రాలమీద ఆధారపడ్డవో, ఆమతాలు భాషాప్రపంచంలో ఏయే భాషల మూలకంగా ప్రబలినవో, వాటి ప్రభావం, కాలక్రమేణా మన యీ వాఙ్మయంమీద ఏయే సన్నివేశాలు కల్పించారో కూడా, మనం గమనించాలి. ఇంత గొడవ ఉంది ఇక్కడ. భారతదేశంలో అనార్యులూ వారిమతాలూ రాజ్యాలూ రాజ్యాధికారాలూ తొలగి, ఆర్యమతమున్నూ ఆర్యసంప్రదాయంవారి రాజ్యాలూ వారిరాజ్యాధికారాలూ నెలకొన్న తర్వాత, భరతఖండానికి అంతటికిన్నీ, ఏకైక భాషగా సంస్కృతమున్నూ, ఏకైక మతంగా ఆర్యమతమూ, అంటే-బ్రాహ్మణ మతమున్నూ, తదనుసారంగా బ్రాహ్మణమతాన్ని ఏకవాక్యంగా అంగీకరించే ఆర్యసంప్రదాయాలకు చెందినరాజుల రాజ్యాలున్నూ, వారి అధికారాలున్నూ, శాశ్వతంగా ఆచరణలోకి రావడం ఆరంభమైనవి. ఈ ఆరంభంతో అదివరకున్న భాషలూ మతాలూ మొదలయినవి అన్ని స్వతహాగానో బలాత్కారంగానో లయావస్థకు పాల్పడ్డవి. ఎక్కడైనా నూటికీ కోటికీ, అప్పుడప్పుడూ, కొన్నికొన్ని పొటమరించినప్పటికీ, అవి భిన్నవర్గానికి చెందిన ఈభాషల వెల్లువలలో, ఈ రాజుల మతోద్రేకంలో, ఈ మతానికి ప్రాబల్యం చేకూర్చిన రాజ్యాధికారాల దాడిలో, నిలువలేక కంఠగత ప్రాణాలుగా అక్కడా అక్కడా ఉండిపోయినవి. ఈ దురవస్థకు తోడుగా, ప్రజలు, మతం పేరటా సంప్రదాయం పేరటా జరిగే హింసా కృత్యాలను సహింపలేకనున్నూ, సహింపక తప్పని సరిగానున్నూ, ఉన్నస్థితిలో అనాది జైన బౌద్ధమతాలు విజృంభించినవి. ఆర్యసాంప్రదాయం సంస్కృతభాషా (లేదా బ్రాహ్మణవాఙ్మయం) యజ్ఞయాగాదులే ప్రధానంగా గల వైదికకర్మజాలం—వీటి కన్నిటికీ ఎదురుప్రవాహంగా-

ప్రాకృతభాషా, ఆర్యేతరములైన విషయముల నభిమానించుట, అహింసా సిద్ధాంతం, ఈ మొదలయిన పరికరాలతో జైన బౌద్ధ సాంప్రదాయాలు అడ్డుకొని నిలవబడ్డవి. మొదటిదాన్ని నాటి అధికార వర్గానికి చెందినవారూ, వారి అనుయాయులూ, వారి సంతతివారూ అభిమానిస్తే, రెండవదాన్ని అంతవరకూ దిక్కూ దెసా, లేకుండా ఉన్న జనసామాన్యం, అభిమానించింది. తర్వాత ఏముందీ? పరస్పరం పోరు. జిగీషాయత్నాలు. సామ దాన భేద దండోపాయాలు. ఈ మొదలైనవన్నీ ప్రయోగింపగా ప్రయోగింపగా-తేలిన ఫలితం ఏమంటే, నాస్తిక మతాలూ నాస్తిక భాషలూ నాస్తిక సంప్రదాయాలు అనే పేరుతో ఎదుటివారి ప్రచారమున్నూ, ఆస్తిక భాషలూ ఆస్తిక మాతాలూ ఆస్తిక సాంప్రదాయాలూ అనే పేరుతో ఎదుటివారియందున్న సుగుణాలుకూడా యుక్తిగా తమలో చేర్చుకొని, ఎదుటివారినిగూర్చి—తమ్మును తాము పొగడుకుంటూ, ప్రజలను బుజ్జగించో, బెదరించో, కూడగట్టుకొని రావడమున్నూ ఏర్పడ్డవి. ఈరీతిగా, చివరంటా జరిగేటప్పటికి, సంస్కృతంతో సమానంగా నిలువబడ్డ ప్రాకృతభాషలు దేశభాషల రూపేణా పరిణమించటమున్నూ, సంస్కృతం అధికారవర్గంవారి ప్రాపున స్థిరపడడమున్నూ, ప్రజలు దేశభాషాభిమానులై ఉండడంవల్ల సంస్కృతాన్ని ఎంత అభిమానించినా, ఎదుగుబొదుగులందులో ఏర్పడకపోవడంవల్లనూ, రోజుకు రోజుకు అతివేలంగా పెరిగిపోతూవున్న ఆ వాఙ్మయాన్నీ—దాన్ని అభిమానించే ప్రజలనూ—ఏదో విధంగా తృప్తి పరిస్తినే కాని తమ ఉనికి స్థిరపడకపోవడంవల్లా—విధిలేక ప్రాకృతాలుగా వుండి, అప్పటికి దేశభాషలుగా పరిణమించిన ఆర్యేతరుల భాషల్లో, సంస్కృతాభిమానులయిన బ్రాహ్మణ మతంవారు గ్రంథాలు వ్రాయవలసిన స్థితి కలగడమున్నూ, ఏర్పడ్డవి. ఆంధ్రదేశంలో చాళుక్యుల సామ్రాజ్యం నెలకొన్న పదకొండోశతాబ్ది ఆరంభకాలానికి పూర్వక్రమంగా పరిణమించిన స్థితి ఇది. భరతఖండంలోని తక్కిన అన్ని ప్రాంతాలలోనూ అన్ని దేశాలలోనూకూడా క్రమంగా పరిణమించిన స్థితికూడా ఇట్టిదే.

అయితే ఇక్కడ మరోమాట చెప్పవలెను. పదకొండో శతాబ్దిలో రాజరాజనరేంద్రుడి ప్రాపున నన్నయాదులు దేశభాషలో గ్రంథాలు వ్రాయడానికి సిద్ధపడ్డా, అదివఱకు తరతరాలనుండీ వస్తూఉన్న ఆర్యాభిమానమూ, వైదికశ్రద్ధా, సంస్కృత సంస్కారమూ, వారిని వదలలేదు. విధిలేదు. దేశభాషల్లో రచన

చెయ్యవలెను. మఱిగతి ఏమిటీ? ప్రాకృతాల రూపాన ఉత్పన్నములయి, పీడింపబడి బహుళవ్యాప్తిలో ఉన్న దేశభాషలో, అప్పటికే సంస్కృత వాసన చొరని అందమైన సాహిత్యం వుంది. దాన్ని దేశీ సాహిత్యం అనేవాళ్లు. ఆసాహిత్యపుత్రోవ దేశీయత్రోవ. కొందరు దేశీరీతి - అని కూడా, అనేవాళ్ళు ఉన్నారు. దేశీయ సంప్రదాయాలూ, దేశీయచ్ఛందస్సులూ దేశీయరచనా, దేశీయశిల్పం ఈ మొదలయినవన్నీ - ఆరీతికి ప్రాణాలు. మరిఇప్పుడు, రెండోసాహిత్యపు త్రోవచూస్తాము. దీన్ని సంస్కృత సంప్రదాయమార్గము అనికానీ, మార్గకవిత అనికానీ, అనేవారు. 11 వ శతాబ్ది ఆరంభంనాటికి జైనబౌద్ధమతాలూ వారివాఙ్మయం ఇత్యాదులన్నీ పూర్తిగా నశింపకున్నా, చోళులప్రాపున ఆర్యసంప్రాదాయంవారిదాడికి ఎరఅయి, క్రమంగా అంతర్ధానం కావడమున్నూ ఏర్పడ్డది. ఆంధ్రసంప్రదాయాన్ని నిలవబెట్టేప్రయత్నమనిచెప్పే ఆంధ్రమహాభారతరచన రెండున్నర పర్వాలతో నిలిచిపోయింది. కాని అందులో అప్పటివరకూ ఉన్న సంస్కృతసంప్రదాయాలు అన్నీ సూక్ష్మంగా ప్రవేశపెట్టబడే ఉన్నవి. ఈ పిమ్మట 200 సంవత్సరాలూ ఆంధ్రుల సామ్రాజ్యదశలో మతంలో భాషలో ఏమేమి మార్పులు వచ్చాయో చెప్పలేము. ఈమధ్యకాలంలో - జైన బౌద్ధమతాలయొక్కా - వారి వాఙ్మయంయొక్కా - ప్రభను అణచివేసిన మరోమతంయొక్క చిహ్నాలు ఉన్నవి. పిమ్మట - అనగా చాళుక్య యుగంతర్వాత - దాదాపు రెండువందలయేండ్లు కాకతీయ సామ్రాజ్యయుగం నడచింది. వీరశైవమతం విజృంభించింది. అది ప్రజలలో పాకకుండా - దాన్ని అణచడానికి-బ్రాహ్మణ సంప్రదాయంవారు కాకతీయ సామ్రాజ్యాన్ని ఆశ్రయించారు. అప్పుడు కూడా చాళుక్యయుగంలో వలెనే సంస్కృతంతో బాటుగా దేశభాషా వాఙ్మయాలున్నూ, మగల సమానస్థితితో ఆదరింపబడ్డవి. కానితూచి చూస్తే దేశభాషావాఙ్మయం వైపే ముల్లుమొగ్గుతున్నది. కార్యవాదులూ ఖడ్గవాదులూ అయిన మంత్రులయొక్కా, మతాధికారులయొక్కా, ప్రజ్ఞావిభవంచేత, సంస్కృత సంప్రదాయం నిలవబెట్టబడింది తత్ఫలితంగా పురాణ సాహిత్యం మరికొంత ఉన్నతిని ధరించింది. మహాభారత రచన పూర్తిఅయింది. కాని చాళుక్య యుగంలోని ఆదర్శాలతో కాదు. చాళుక్య యుగంలో మహాభారతరచన ఉపక్రమింపబడ్డా అది పండితుల మెప్పుకోసరంగానే కనిపిస్తుంది. కాకతీయయుగంలో ముగింపువచ్చిన మహాభారత రచన ఆంధ్రావళిని మోదము పొందించడానికిగా స్పష్టమవుతుంది. ఇంతే కాదు. ఈదృష్టితో పరిశీలిస్తే - నన్నయ్యగారి 'సారమతిం గవీంద్రులు' [illegible]

లోని తత్వమున్నూ, ఆనాటివాఙ్మయనిర్మాతల ఆదర్శమున్నూ, దేశభాషలపై ప్రయోగింపబడ్డ హత్యాకాండవిరావాలున్నూ, మనస్సుకు లీలగాగోచరిస్తవి. కావున భారతామృతము "కర్ణపుటంబున" అనే తిక్కన్నపద్యాన్ని కూడా, మననం చేస్తే - ఇట్లే ఆయన ఆదర్శమూ, హరిహరనాథతత్వమూ, ఇత్యాదులన్నీ దృష్టికి వస్తవి. వీరేశలింగంపంతులుగారి - 'నన్నయ్యరచనలో మూడువంతులు సంస్కృతపదాలున్నూ ఒక్కవంతు తెలుగుపదాలున్నూ తిక్కనరచనలో మూడువంతులు తెల్గు పదాలున్నూ ఒకవంతు సంస్కృతపదాలున్నూ' - అనేమాటలుకూడా చక్కగా బోధపడుతవి. నన్నయ్యగారి వృత్తాలూ ఆంధ్రభాషానుశాసనపద్ధతులున్నూ కూడా మనసుకు ఎక్కుతవి.

ఇక తర్వాత చూతాము. పురాణసాహిత్యం - అంటే, నన్నయ్యతో ఆరంభమైన పురాణాల అనువాదపు వాఙ్మయం - రెండోయుగం చివఱకు కొంత పరిణతి పొందింది. కాని పండితులకుకూడా దానిపై నివ్యామోహం తగ్గింది. రాజాశ్రయంగానీ, పోషకవర్గంకానీ, చాలినంత లేకపోవడం అట్లాఉండగా, ప్రజాభిమానం పండితాదరణా శిథిలత్వాన్ని పొందసాగినవి. అయితే మరల ఈనందుచూచుకొని, దేశీమార్గాన్ని నిలవబెట్టే నాథుడులేడు. కాకతీయసామ్రాజ్యంలో పాళెగాండ్లుగాఉండే రెడ్లు స్వతంత్రులయ్యారు. వారిసామ్రాజ్యం వెలుగసాగింది. కాని వారు అంతగా ఏమార్గాన్నీ బలపరచ గలిగినంతటి వాఙ్మయశక్తి కలవారు కారు. అయినా వారిని నామతః చాటుచేసుకొని, మరిపురాణకవిత రెక్కొన్నది. అయితే పురాణాల తర్జుమాకాదు - కానీ కాకాపోదు. పురాణాదులలోని ఏదో ఒక అంశం ఆధారంగా పెట్టుకొని, అలంకారశాస్త్రాలకొలతలతో, ప్రబంధాలనే పేర, అప్పటిపోషకుల లౌల్యానికి అనుగుణంగా, శృంగార రసమనే పేరుపెట్టి, సంబంధంఉన్నా లేకున్నా అష్టాదశవర్ణనలూదింపి, క్షుద్రాతిక్షుద్రమైన కామాన్నే పోషిస్తూ, రచన సాగించారు. అయితే నాటిప్రజలకు ఇది అసహ్యంగా తోచలేదు. కొందరికి తోచిందేమో, కాని ప్రభువులకుగానీ వారినినడిపించే ఆర్యమతవర్గానికిగానీ, అసహ్యంగా తోచలేదు. కారణం బహుశః యజ్ఞంచేసి సోమపానంచేసిన సోమయాజులవారు ఏర్పరచిన శిష్టసంప్రదాయం అని తృప్తిపడ్డారేమో: - చెప్పలేను. అయితే ప్రబంధకవిత్వం అనే పురాణసాహిత్యంలోని భాగానికి, ప్రచారకుడు శ్రీనాథుడు. ఈమహానుభావుడు రచించినవే అంటారు క్రీడాభిరామమున్నూ వీధినాటకం

వర్గ రాలున్నూ; వాటినిన్నీ ఇతరప్రబంధాలనున్నూ పరిశీలించిచూస్తే, సరసకవితాచక్రవర్తి మాత్రమే కాకుండా, ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః అన్న విధిని అక్షరాలా ఆచరించిన సనాతనుడని తోస్తుంది. ఇంతకూ చెప్పవచ్చిందేమంటే, పురాణసాహిత్యం ప్రబంధాలు అన్న పేరుతో మరోరూపం ధరించి అల్లుకున్నదని మాత్రమే. ఆదర్శంకానీ సుదూరమయిన వివేచనకానీ లేకుండా, ఇదీ తాత్కాలిక ప్రయోజనం మాత్రమే చూసుకొంటూ వృద్ధిపొందింది. దీని పరమప్రయోజనం ఈపాటే; ఆపిమ్మట రెడ్లయుగందాటి కృష్ణరాయలయుగం ఆరంభమైంది. మహాశూరుడు ఇతడు. కర్ణాటాంధ్రదేశాలు రెండింటినీ ఒక గొడుగు క్రిందికి తేవడానికిన్నీ-ఆర్యేతరనీ అనార్యతగానీ సాయమూతాన్నవశేషంగా నిలచివున్నస్థితిలో-తన ప్రజలను మంచివ్యవస్థతో దిద్ది తీర్చడానికిన్నీ తనమనోధనములు ధారపోశాడు. కత్తీ కలం రెండూ తన కార్యవిజయానికి పూర్తిగా ఉపయోగించాడు. కాని లాభమేమి? అష్టదిగ్గజాలను పెంచినా, దేశభాషల్లో తెలుగులెస్స అని నమ్మినా, ఆలెస్సను ప్రకటించడానికై తానూ గ్రంథరచనకు పూనుకున్నా, పదకొండోశతాబ్ది ఆదిలో పునాదివేయబడ్డ త్రోవలోనే, మరికొంత ప్రబంధరాశి ఉత్పన్నమైందేకాని, అంతకంటే ఫలితం విశిష్టమైనది ఏర్పడలేదు. ఈరాయలయుగం దాదాపు పదిహేడో శతాబ్ది అర్ధభాగం గడచినదాకా సాగింది. తర్వాత నూటఏబది సంవత్సరాలున్నూ మహమ్మదీయసామ్రాజ్యం శిథిలమైపోయి ఆంగ్లసామ్రాజ్యం స్థిరపడేసందర్భములోనివి. ఈమధ్యకాలంలో అనేకంగా వాఙ్మయాంకురాలు- లేవని అనడానికిగాని, ఉన్నవని నిరివిగా ప్రదర్శించడానికికానీ చాలీచాలనివి-మొలిచాయి. అంటే అక్కడక్కడా ప్రబంధనిర్మాతలూ ఉన్నారు; లక్షణాలూ శాస్త్రాలూ ఆంధ్రీకరణాలూ ద్వ్యర్థికావ్యాలూ వీనిరచయితలూ, ఓష్ఠ్యనిరోష్ఠ్య వచన నిర్వచన ప్రబంధ నిర్మాతలూ, శతకగేయదండకాది కృతినిర్మాతలూ ఉన్నారు అన్నమాట. అయితే ఇవి అంత ప్రధానాలుగా చెప్పతగ్గవికావు. మరి సింహావలోకనం చేసి చూద్దాం:—

ఇప్పుడు పురాణసాహిత్యం అంటే ఏమిటో దిక్ప్రదర్శనంగా మనము ప్రత్యక్షం చేసుకోవచ్చు. ఒకటి రెండు మాటల్లో చెప్పేటట్టుగా ఉంటే, ఆర్యభాషాసంప్రదాయాలూ, వారిలక్షణశాస్త్రాలూ, అవి ఏర్పరచిన పడికట్లూ తప్పకుండా, అష్టాదశవర్ణనలున్నూ చతుర్విధనాయకులూ, అష్టవిధనాయికలున్నూ పాదాది (నఖాది అనరాదోలు!) కేశాంతవర్ణనలో, లేక కేశాదిపాదాంతవర్ణనలో నెలకొల్పి, ఆయా కాలపు తమ ఏలికల అభిరుచులకు తగినట్లో, తమబుద్ధికి సరసంగా ఉందని తోచి

నట్లో నెలకొల్పి, క్షుద్రశృంగారం సంస్కృతం చుట్టిన ఆ విశ్వాసవిభాగాదులతో, కృత్యాద్యవస్థలతో, స్వప్నగాథలతో, పుష్పలావికలు మొదలగు అన్నిరకాల శృంగారదేవతలను ఆహ్వానించి, తృప్తిపొందించి వదలివెయ్యడం అనేది, మొత్తం మీద పురాణసాహిత్యంయొక్క ఈ తొమ్మిదివందలయేండ్ల ప్రవృద్ధికి ఫలమని అనవచ్చును. పురాణాలతర్జుమాలు కథాభాగాదులతో నిండిఉండే కారణంచేత, ఆఖరుదశలోని ప్రబంధములలో ఉన్న శృంగారవివరాలు అన్నీ పూర్తిగా లేక పోయినా-కనీసం స్వప్నగాథ, నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయాది వర్ణనలున్నూ అందులోని అంతర్భాగాలున్నూ తప్పనిసరిగా కలిగి ఉండితీరుతవి. ఇక నవ్యసాహిత్యం ఏర్పడ్డా-ఏర్పడుతూఉన్నా పరిస్థితులు ఆలోచించాలె. కాకతీయయుగంతో మనకు సామ్రాజ్యభావం నశించింది. గ్రహచారం చాలనప్పుడు ఎంత జాగ్రత్తగా ఉన్నా-ఎన్ని శాంతులు చేసినా-అవి ఫలించనట్లే, కాకతీయసామ్రాజ్యం తర్వాత మళ్లా దేశాన్ని కూడగట్టుకోరావడానికై మహమ్మదీయ సామ్రాజ్యాన్ని ప్రతిఘటింపగల విజయనగరసామ్రాజ్యం మొదలయినవి బయలుదేరినా, అవి ఎల్లాగైతే నేమి విఫలాలు అయినవి. కల్పాంతస్థాయిగా ఉంటుం దనుకొన్న మహమ్మదీయసామ్రాజ్యం కూడా నశించిపోయి, ఏరూపేణా వస్తే ఏమీ, ఆంగ్లసామ్రాజ్యం మన దేశంలో పందొమ్మిదోశతాబ్దములోనే ప్రచురానికివచ్చి స్థిరపడిపోయింది. ఆంగ్ల పాలన ఫలితంగా, మనకు ఆంగ్లవిద్యాపరిశ్రమమూ, ఆంగ్లుల ఆచారవ్యవహారాల వాడుకలూ, వారి రాజకీయ సాంఘికపరిజ్ఞానమూ, తప్పో ఒప్పో కొంత స్వదేశవిదేశాలకు సంబంధించిన చరిత్రజ్ఞానమూ, స్వదేశ స్వభాషాభిమానమూ, తన్మూలాన మన పరాశ్రయస్థితీ, జనసంఘంలో ఉన్న లోపాలూ, వాటిని సవరించుకోవడానికన్నీ విదేశాలతో సాటిగా ఉండాము నే దానికన్నీ తగిన యత్నమూ—ఇత్యాదులు మనలో అంకురించినవి. ఇంతవరకూ అవిఅన్నీ సుగుణాలే అని చెప్పవచ్చు. కాని సుఖదుఃఖాలూ శీతోష్ణాలూ మొదలయిన ద్వంద్వాలలాగునసే, ఈ సుగుణాలతో చాటుగా కొన్ని దుర్గుణాలుకూడా మనకు అంటుకున్నవి. ఐచ్ఛికంగానో నిర్బంధంగానో అబ్బిన విదేశీయ ఆచారవ్యవహార భాషాసంప్రదాయాలు మంచివనే ఒకవ్యామోహం స్వజాతిదూషణం పరజాతికీర్తనమూ ఆత్మవిశ్వాసశూన్యతా, నిత్యశంకితావస్థా, వీటిఅన్నిటినీ మించిన దారిద్ర్యం, ఆదారిద్ర్యంలో మునిగి పరస్పరాఽవిశ్వాసాలతో నిండిన అప్రయోజకములైన కులద్వేషాలు, స్వార్థపరత, అందుకై తన్ను

గానీ, తనదేశాన్నికానీ, జాతినికానీ, బలిపెట్టే అసభ్యమైన త్యాగం-ఇత్యాదులు ఆ గుణాలతో మనకు అంటుకున్న శాశ్వతదోషాలు.

అయితే, నేటివారికి ఈ గుణదోషాలు స్వయంగా కలిగినవి అనడానికి వీలులేదు. వీటిని మనలో నాటుకొనేటట్లు చేయడానికై మన కులపతులున్నూ, బలాత్కారంగా మనలను ఆంగ్లభాషా పఠనానికి పురికొల్పి దీన్ని మనలోకి ఎక్కించడానికి తలిదండ్రులున్నూ చాలా యత్నం చేశారు. ఎవరెంతచేసినా దాని ఫలితం ఎల్లాఉన్నా అది మన మంచికోసరమే అని ఇప్పుడు మనం అనుకోవాలె. ఆంగ్లభాషద్వారా, మనవారి అనుమతితో మనం అనుభవానికి తెచ్చుకొన్న స్వదేశీయ విదేశీయ చరిత్రజ్ఞానమూ, మన విద్యాలయాలల్లో మన అధ్యాపకులు బోధించి మన మనస్సుల కెక్కించిన విదేశీయ సారస్వతాలూ, అందలి కళాసంపదా-కవిత్వశోభా-సాంఘిక వ్యవస్థలూ-ఉన్నతసాధనలూ-ఆత్మజాత్యభిమానమూ-మాతృభాషాప్రీతి-ఇత్యాదులన్నీ కలసి, మనవేషంలో-భాషలో-మాటలో-మంతిలో-ఆచారంలో-వ్యవహారంలో-ఒకటేమిటి, అన్నివిషయాలలోనూ ఇంతవీ అంతవీ అని చెప్పడానికికూడా సాధ్యంకాని మార్పులు తెచ్చిపెట్టినవి. ఈ మార్పులు మాత్రమేగాక, ఇంకా, ఖండ ఖండాంతరాలలోనివి, క్షణానికి వేలకొద్దీ మైళ్ళవేగంతో అభివృద్ధిపొందుతూఉన్న విజ్ఞానాన్ని గురించిన వార్తలు, మనకు ఎప్పటికప్పుడు తెచ్చి గుమ్మంలో వినిపించే దినపత్రికలూ, వారపత్రికలూ, మాసపత్రికలూ, మొదలయినవన్నీ కలిసినవి. ఇంకా ఎన్నో వెలుస్తున్నాయి. ఏపాటి దృష్టికలవారి కయినా ఇవి అన్నీ కనిపిస్తవి.

యువక జీవితంలో మనవారు తెచ్చిన మార్పు

యువకజీవితం-అందులో ఇంతటి విశ్వవిజ్ఞానాన్ని గురించి నిరంతరం వింటూ కండ్లతో కంటూఉన్న నేటి యువకజీవితం తత్రాపీ స్వజాతీ స్వభాషా స్వీయవిజ్ఞానం ఏ పరిమితిలో, ఏపాటి సుస్థితిలో, ఉందో స్వానుభూతాంగ్లవిజ్ఞానంతో పోల్చి చూచుకొన్న యువకజీవితం, అఖిల ప్రపంచములోనూ తమస్థానం ఏదో తేల్చుకోవాలనే ఉత్సాహవ్యగ్రత గల యువక జీవితం-ఔదాసీన్యం వహించి ఉండగలదా! ఉండజాలదుకదా! పెద్దలు అనుమతించినా అనుమతింపకున్నా-తమప్రయత్నం నెగ్గినా నెగ్గ న్నా-మనుష్యులై పుట్టినందుకు, అందులో ప్రపంచజ్ఞానాన్ని రుచిచూచినప్పుడు, మభాషలోకూడా, అట్టి విభవాన్ని ఏల నెలకొల్పకూడదు? ఇదీ ఈ ఇరవయ్యో తాబ్దిలోఏర్పడ్డప్రధానబీజం. ఈబీజంకార్యరూపేణా ఫలితం పొందజేయడానికే వివిధ

రీతుల నేటి యువకవర్గం యత్నిస్తున్నది. భారతవర్షంలోని తక్కిన దేశాలవారిలో కంటే ఆంధ్రులలో, చాలా ఆలస్యంగా ఈ బీజాలు నెలకొని పాటమరించాయి. పందొమ్మిదో శతాబ్ది అర్ధభాగం గడచిన పిమ్మట ఆంధ్రక్షేత్రంలో ఈ బీజములు మొలకలెత్తినవి. ఆ మొలకలను యుక్తసమయంలో కనిపెట్టి, ఆరిపోనీయకుండా పెంచడానికై త్యాగం చేశారు వీరేశలింగం పంతులుగారూ, అప్పారావుగారూ. నిజానికి వారు పురాణసాహిత్యంలో పుట్టి పెరిగినవారే! అయితేనేమి? ఆత్మవిస్మృతి వారికి కలుగలేదు. ఆంగ్లవిజ్ఞానానుభవము వారిని రేపెట్టి, మహోత్సాహాన్ని ఇచ్చిననూ, సాంఘికంగానూ సారస్వతికంగానూ వారు పాటుపడడానికై ప్రయత్నించారు. మనలో శతాబ్దులనుండీ-అనేకసహస్రాబ్దులనుండీ, నెలకొని ఆత్మవిస్మృతిని పోగొట్టుటకై విశ్వప్రయత్నాలు చేశారు. అప్పటికే ఎన్నో శతాబ్దుల క్రిందటనే మనం ఉన్నతిలోనుండి అంధకూపంలో బడ్డాం. నిద్రాముద్రితులము అయిన అరకన్నులతో ఊరకున్నా బాగుండేది; అట్లు చెయ్యలేదు. అన్నివిధాలా వారిని అడ్డుకున్నాము; తిట్టాము; (ముందుగూడా వారు కీర్తిశేషులయివున్నా తిట్టుతాము.) దీవించాము; బ్రదిమాలాము; చివరకు మొండికెత్తాము. కాని, వారు ఆయత్నాలు మానలేదు. చివర నిశ్వాసం వదిలేవరకూ వారు సంఘసంస్కరణానికిన్నీ సారస్వత నిర్మాణానికిన్నీ కృషిచేస్తూనే ఉన్నారు. వారికృషిలో ఒక్క లోపం కలిగింది. అది రాజకీయ సంస్కరణం దీనికిన్నీ, సారస్వతానికిన్నీ ఆవశ్యకమని స్ఫుటంగా అప్పటికి తోచకపోవడమే. అయితే ఆమహానుభావుల బోధనలూ త్యాగమూలాలూ వ్యర్థములుకాలేదు. అవివారిఅభిలాషలలో పొడసూపినవి. నేడు వివిధశాఖలలో దేశారాధనంచేసినవారూ లేక చేస్తూఉన్నవారూ వ్యక్తులు అందరూ- ప్రత్యక్షంగానో పరోక్షంగానో వారిశిష్యులే అని అనవచ్చు. నేడు సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా ఉన్నతిని సాధించేకొఱకు అనేక సంఘాలు ఏర్పడ్డవి. కులభేదాలనూ దృష్టిదోషాలనూ ఈ మొదలయినవానిని పోగొట్టేనిమిత్తం సాంఘికసమాజాలూ, సభలూ పనిచేస్తున్నవి. రాజకీయంగా ఉన్నతిని తెచ్చేందుకు దేశంలో వివిధరాజకీయపక్షాలు పనిచేస్తున్నవి. ఆర్థికంగా ఏర్పడ్డదుర్దశను పోగొట్టేకొఱకు గ్రామాదుల్లో నగరాదుల్లో ఆర్థికసంఘాలు అహోరాత్రాలు కృషిచేస్తున్నవి. ఈ సాంఘిక రాజకీయార్థికవిషయాల్లో కృషిచేస్తున్న వీరంతా మనకు పూజ్యులు, గౌరవింపదగినవారు. ఇందుమూలంగా తమతమ మనోధనాలను అఖండంగా త్యాగం చేస్తున్నారు. వీరిలో అనేకులు మన నిరసనానికి కూడా పాల్పడ్డారు, పాల్పడుతున్నారు, ముందున్నూ పాల్పడగలరు. వీరికృషిని

మనం కృతజ్ఞతతో స్మరిస్తూనే ఉన్నాము, ఉంటాముకూడా. ఇక మిగిలినది సాహిత్య శాఖకు చెందినవారము. మనం ఆరంభించినకృషి అనంతరూపాలుగా ఉన్నది. వీనిని ఒక్కొక్క దానినీ పేర్కొనడం శక్యం కాదు. సంగ్రహంగా మనవిచేస్తా. మొదట గమనించవలసిన భాగాలు రెండు. ఒకటి అన్వేషణవిభాగం, మరొకటి నిర్మాణ విభాగమున్నూ. మొదటి విభాగంలో ఇంతవరకు ఉన్న మా వాఙ్మయంలోని ప్రాచీనాంశాలను వెదకి వేర్పరచడం ఒకఅంశమున్నూ, అల్లా వేర్పరచినవాటిలో ఇప్పటి నిర్మాణానికి పనికిరాగలవి ఏవో గుర్తించడం రెండో అంశమున్నూ, చేరి ఉన్నవి అంటే రాజకీయంగా గానీ, సాంఘికంగా గానీ, సారస్వతికంగా గానీ, మనవాఙ్మయ ప్రపంచంలో మనపూర్వులు ఏమేమి నిక్షేపాలూ నిధులూ దాచిపెట్టారో వెదకి కనిపెట్టడమున్నూ, ఆకనిపెట్టినవాట్లలో నేటి మన అవసరాలకు పనికివచ్చే సాధనాలు ఏమేమి ఉన్నవో, వాటిని ఎల్లా ఉపయోగించుకోవలెనో మనసోదరులకు తెలపడమున్నూ, మొదటిభాగానికి చెందిన కార్యక్రమము - లేదా కృషి. రెండోదైన నిర్మాణ విభాగంలో, సంఘంలోనూ సారస్వతంలోనూ, ఇంకా తక్కినవానిలోనూ, ఏయే లోపాలు ఉన్నవో కనిపెట్టి, తగినరీతిని నేటిసంఘానికి జ్ఞప్తికి తేవడమున్నూ, మనలను ఆకర్షించిన వివిధ సారస్వతోద్యానాలలో, రమ్యములయినవీ, ఉల్లాసకరములైనవీ, శాశ్వతస్థాయిని ఇవ్వగలవీ మొలకలను కొనితెచ్చి, వాటిని వివిధరీతులతోను నాటి, వేరు గట్టించి, నీరుపోసి, పెంచి, ఫలింపజేసి, ఆ ఫలాలను ముందు రాబోవు సంతతికై అర్పించి, మన అప్పు తీర్చుకొని, ధన్యత పొందడమున్నూ ఇమిడి వున్నవి. ఇందుకై మనం కృషి చేస్తున్నాం, చేస్తాము. నెగ్గనీ నెగ్గకపోనీ, నవ్యసాహిత్యపు ఆదర్శం ఇదీ. అది ఏర్పడ్డా-ఏర్పడబోయే- పరిస్థితులకు మూలకారణం ఇదీ! కాబట్టి, ఇంతవరకూ మనం చేసిన కృషి ఏమో చర్చించుకోవడమున్నూ ముందు చేయవలసినకృషి ఏదో, ఏత్రోవలను బట్టి మనం పనిచెయ్యవలెనో, నిర్ణయించుకోవడమున్నూ ఈపరిషత్సమావేశాలవల్ల ఏర్పడవలసిన ఫలం. కనుక పైని చెప్పిన వివరణం ద్వారా పురాణసాహిత్యానికీ, నవ్యసాహిత్యానికీ ఆదర్శాలలో ఆచరణలో ఉండే-ఉండతగ్గా-భేదాలు నాబుద్ధికి అందినవరకూ సంగ్రహించాను. ఈఆదర్శాలు సిద్ధింపచేసుకొనే నిమిత్తం మనం నేడుప్రయత్నిస్తున్నాము. మనత్రోవకు అడ్డుగా ఉన్నవని తలచినవానిని, మనం నిస్సంకోచంగా తీసి పారవేస్తున్నాం. మంచిదిగానీ చెడ్డదిగానీ మనకు అనుశ్రుతంగా వస్తూఉన్న సంఘాన్ని మనం వదలదలచుకోలేదు; వారు మనలని వదలించుకోదలచుకొన్నా మనం వదలము. అందుకే

ఎప్పుడో పాతిక శతాబ్దాల క్రింద ఏర్పడ్డ లక్షణశాస్త్రాలూ వ్యాకరణశాస్త్రాలూ విధించిన కట్టుబాట్లనున్నా, ధర్మశాస్త్రాలూ సంఘశాస్త్రాలూ నియమించిన నిబంధనలనున్నా, కులాలూ మతాలూ వ్యక్తులూ ఇత్యాదులలో గల భేద భావాలున్నా మన అభ్యున్నతికి అడ్డుపడుతున్నట్లుంటే వానిని తోసివేస్తున్నాము. ప్రయోజనకరాలుగా ఉన్నవాటిని సిరసావహిస్తున్నాము. మనస్థితికి పరికరాలు చాలవని తోచినప్పుడు, భారతీయమూ అభారతీయమూ అనే భేదభావం లేకుండా, ఎవరిసంప్రదాయాలైనా సరే, మనలో చేర్చుకొంటున్నాము-చేర్చుకొంటాముకూడా. దీనికి చింతింపవలసిన పనిలేదు, సంకోచించవలసినది అంతకంటే లేదు. మనపూర్వులు చేసిందీ ఇదే-మనం చేస్తున్నదీఇదే. దూషణభూషణములకు-శుద్ధహృదయం ఉన్నవ్యక్తి అయితే-తలవొగ్గరాదు. ఈచేసినచర్చతో నవ్యసాహిత్య నిర్వచనంచేసినట్టు అవుతుంది. పై ఉద్దేశాలు గల ఏవ్యక్తి అయినా సరే, హృదయపూర్వకంగా సాహిత్యపరిశ్రమ చేస్తూ ఉంటే అట్టివారికి అందరకీ ఈపరిషత్తులో తావు ఉండవలయును. గ్రాంథికవాదులు గానీ, వ్యావహారికవాదులు గానీ, చరిత్రశోధకులుగానీ, చరిత్రనిర్మాతలుగానీ, సంఘంలో సనాతనులుగానీ, అధునాతనులు గానీ, పాటలూ పదాలూ చెప్పేవారుగానీ, గద్య పద్యాలు నిర్మించేవారుగానీ, ఇంతయెందుకు? కూలిచేసికొనే కూలివాడు మొదలు కోటీశ్వరుడివరకు. అందరూ సమానస్వత్వాలతో ఇందు సభ్యులు కావడానికి వీలుండాలి. అనాగరికులుగా ఉండేవారిదగ్గరినుండీ నాగరక శిరోమణులుగా ఉండే సమస్తప్రజలకూ, వారివారి యోగ్యతలకూ, అనుభవాలకూ తగిన వాఙ్మయాన్ని నిర్మించి, ఈనవ్యసాహిత్యంలో చేర్చవలెను. అట్లయితేనే-ఇది నవ్యసాహిత్య పరిషత్తు అగును. అయితే- ఇప్పుడు- ఇంతవరకూ సిద్ధమైన నవ్యసాహిత్యం ఈ ఆదర్శాలతోఉన్నదా? దీనిని నేటివిమర్శకులలో కొందరు దర్భపవిత్రపాణు లయిన శిష్టసంప్రదాయంవారు - అసభ్యవాఙ్మయమనీ, అశ్లీలవాఙ్మయమనీ ప్రకటిస్తూ ఉన్నారే? ఆమాటలకు ఈనవ్యసంప్రదాయంవారు మౌనంగా ఉంటున్నారే? అట్లుండుట అంగీకారము అయినట్లు కాదా? నిజానికి నేటి నవ్యసాహిత్యం క్షుద్ర శృంగారం కాదా?— అనేప్రశ్నలు బయలుదేరవచ్చును. బయలుదేరాయికూడా. అయితే ఒక్క ఇవేకాదు. ఇంకాప్రశ్నలు చాలాఉన్నవి. అర్థంలేని వాఙ్మయమనీ, సంఘానికి చీడపురుగులాంటి సాహిత్యమనీ,ఇత్యాదులుకూడాఎన్నోదూరులు ఉన్నవి. కొందరుసోదరులు దీనిని అణచివేయడానికి రాజకీయసాధనాలుకూడా కావాలంటున్నారు. కాని, వారందరూ మనకు హితకాములే. ఈప్రశ్నలకు సంగ్రహంగా,

ఒకటి రెండు సమాధానాలు చెప్తాను. అసభ్యం అనేది వ్యక్తులయొక్కా, ఆవ్యక్తులాధారపడిఉండే సంఘాలయొక్కా అభిరుచిమీద ఆధారపడి ఉంటుంది. అది అచ్చంగా ఒక్క వాఙ్మయదోషం మాత్రమే కాదు. దేశాన్నిబట్టీ కాలాన్ని బట్టీ వ్యక్తులనడవడిని బట్టీ అది స్ఫురిస్తుంది. ఒక్క ఉదాహరణం చూడండి:— అంకముజేరి శైలతనయాస్తనదుగ్ధములానువేళ-అనే పద్యం ఉన్నది. ఆపద్యంలోని భావాన్ని సమాలోచనం చేస్తే, కవిఉద్దేశించిన పరదైవతమైన అగజాస్యుడు భావుకుని అభిరుచినిబట్టి తదనుసారంగా పొడగట్టుతాడు. భావుకుడు వేళాకోళం చెయ్యదలచుకొన్నవాడైతే, అంతటిపరదైవతం ఆకతాయిగా మారుతాడు. అల్లాగాక, కవి ఉద్దేశం గ్రహించేవాడైతే సగుణావిర్భూతుడైన ఆపర దేవతయొక్క లీలావిలాసానుకృతి మనసుకు వస్తుంది. ఇది ఒక్క పద్యంలోనే కాదు, గద్యంలోనే కాదు, పదాలలోకూడా ఉంది. నన్నయ్యగారు గరుత్మంతుడిచేత తల్లిని 'పయోరుహాననా' అని పిలిపిస్తాడు. అంతదాకా ఎందుకూ? నన్నయ్యనాటి కంపు నేటిమనకు ఇంపు కాదు. అశ్లీలం కూడా, ఈ అసభ్యంలాంటిదే! అయితే బాగా పరిశీలిస్తే కొంత ఉన్నదేమో కూడా. ఉంటే, వాటిని సవరించుకోదగినప్పుడు సహృదయుడైనవాడెవ్వడూ అంగీకరింపకపోడు. విమర్శకులకు జవాబు ఇవ్వకపోవడం మాత్రాన-అది క్షుద్రశృంగారం కాజాలదు. "నేటికాలపు కవిత్వం" వ్రాసిన మీమాంసాశిరోమణులుగానీ తక్కినచూపు ఓపమి విమర్శకులుగానీ, ఇంతవరకూ ఏల అది క్షుద్రశృంగారం అయిందో సహృదయత్వంతో వివరింపలేదు. అసలు ఇంతవరకూ ఎందుకూ?-నవ్యకవుల సంప్రదాయమే వారు అర్థం చేసుకో తలంచలేదు. దానికి రెండు కారణాలు. ఒకటి నవ్యకవుల శృంగారలక్ష్యాన్ని గానీ, ఆలక్ష్యాన్ని సిద్ధింపజేసేందుకై వారు అవలంబించిన నూత్నమార్గాన్ని కానీ, వారు గమనించలేదు. ఎట్లు గమనించలేదో-ప్రదర్శించడానికి కొంత ప్రయత్నిస్తాను. ధర్మార్థకామమోక్షములనే నాల్గున్నూ పురుషార్థాలని చతుర్వర్గవాదులున్నూ, ధర్మార్థకామాలనేవి మూడే పురుషార్థాలని త్రివర్గవాదులున్నూ, ఎన్నో శతాబ్దముల నుండీ వాదిస్తూనే ఉన్నారు. అర్థకామాలు రెండు ఉద్వేగకరాలనిన్నీ, అవ్యవస్థగా అవలంబిస్తే అవి అనర్థాలుగాకూడా పరిణమించి పాడుచేస్తవనీ, కాబట్టి ఆఉద్వేగం తప్పించడానికై, అర్థానికి ధర్మానుబంధాన్నీ, కామానికి మోక్షానుబంధాన్నీ ఏర్పరచారనీ, అందుచేత-ధర్మమునకు విరోధింపని రీతితో కామాన్ని సేవింపవలెననీ వారు అంటారు. ఇంతవరకూ బాగానే ఉన్నది. ఏది ధర్మం ఏది ధర్మంకాదు-అన్నది తేల్చడం

ఎల్లాగ? అందుకువారే చెప్పారు ఒకయుక్తి - లోకానికి క్లేశం కలగించనిదీ, పెద్దలు ఆచరించేదిన్నీ, అందులోకూడా విరోధంకనిపిస్తే పరిశుద్ధమైన హృదయంతో తనలో తాను చర్చించుకొన్నప్పుడు తనహృదయము త్రికరణశుద్ధిగా ఏది బోధిస్తుందో అట్టిదిన్నీ, ధర్మమని మనువు అంటాడు. ఇల్లాగే ఎట్టికామం మోక్షవిరోధి? అట్టిది కాదు? అనే సందేహం వస్తే, ఎవడికివాడు మనశ్శుద్ధితో త్రికరణశుద్ధిగా ఇది ప్రీతి కలిగించేది అని చూస్తాడో అది కామమని అంటారు వాత్స్యాయనాదులు. అయితే శాస్త్రకర్తలు ఇచ్చిన అకలుషమైన ఈ హృదయాభ్యనుజ్ఞను యుక్తి ప్రత్యుక్తులతో తోసివేసి, రసహృదయం లేదనుకొని, పరులనిర్ణయంకోసం ఎదురుచూచి, వారు ధర్మం అంటేకానీ, లేదా ఇది కామం అంటేకానీ-మనం దానికి బద్ధుల మైపోవల సిందే అనేనా దీని తాత్పర్యం? దీన్ని లక్ష్యంలోనికి తిరుగపోతాను. నేను బ్రాహ్మణుడనుగా ఉన్నాను. బ్రాహ్మణులలోనే మరోవిభిన్నశాఖ స్త్రీని ఆబాల్యము ఎరిగిఉండీ, ఆమె సత్కులప్రసూతత్వాన్నీ సౌశీల్యాన్నీ, ప్రత్యక్షంగా తెలిసికొనిఉండిన్నీ నాహృదయం అభ్యనుజ్ఞ ఇస్తున్నా, ఆమెను నేను పెండ్లాడటానికి వీలులేదన్నమాట? నాకుఇష్టంగానీ హృదయాభ్యనుజ్ఞకానీ లేకపోయినా సంఘం ఎన్నిన ఆమెనే నేను పెండ్లాడవలెను; అంటే తేలినదేమి అంటే-పురాణపంథా వారు సమానపవిత్రత సమానమైన వ్యవస్థాశీలత కల-ధర్మం ప్రేమా-అనే రెంటిలో, ప్రేమ ధర్మానికి లొంగిఉండవలె నంటారు. నవ్యమార్గంవారు ధర్మం అనేదే ప్రేమకు లొంగి ఉండవలె నంటారు ఇదీ ఇద్దరికీ ఉన్న తేడా. రెండూ అనాదులే. మన వాఙ్మయంలో రెండింటికీ లక్ష్యాలు కనిపిస్తవి. రెండూ లోకమర్యాదా స్థాపకులు ఆయాకాలాలలోని పరిస్థితులబట్టి సంఘక్షేమానికై ఏర్పరచినవే. రెండూ భారతీయాలే కూడాను. అయితే నేటిస్థితిలో ఒకటి పూజ్యం మరిఒకటి త్యాజ్యంగా పరిణమించినవి. ఇది ఇల్లా ఉండగా, మరోవిశేషం ఈప్రేమ వాదులలో ఉంది. అది ఏమిటంటే లౌకికంగా అట్టిప్రేమకు ఫలితమైన వివాహం సంభవింపకపోతే, హృదయాభ్యనుజ్ఞాతమైన ఆ పవిత్రప్రేమకై ఆజన్మమూ తపస్వివర్తనముతో గడపుటకు నేటిప్రేమవాది పూనుకుంటాడు. ఇది ఉత్తమత్వం నిరూపించే ఆదర్శంకాదా? ఈఆదర్శాన్ని ప్రచారంలోకి తెచ్చుటకై నవ్యకవి తన సాహిత్యశక్తులను వినియోగిస్తాడు. దానినే ముక్తకంఠంతో వేయివిధాల గానం చేస్తాడు. కాళిదాసుని రఘువంశంలోని అజుడు ఇట్టి వ్యక్తిగా తీర్చబడ్డాడు. మన పురాణాలలో నేను చదివినంతవరకు భర్తలకోసం ఆత్మత్యాగంచేసిన- అంటే సహగమనంచేసిన-పతివ్రతామూర్తులు

...కులు కనిపిస్తారు; కాని అకలుషమై అలౌకికంగా ఉన్న ప్రేమకై తనజీవితాన్ని ...ణజేసిన పురుషుడు, ఒక్కఅజుడే కనిపిస్తాడు. ఈదృష్టితో నవ్యులసాహిత్యాన్ని ...వ పూనుకొంటేనూ, వా రేర్పరచుకొన్న రచనాపరిభాషను శాంతంతో అర్థం ...కోవడానికిప్రయత్నంచేస్తేనూ, అది సార్థకవాఙ్మయమే అనిన్నీ, అట్టివాఙ్మయం ...డా మనవారికి ఆవశ్యకమే అనిన్నీ స్వయంగానే తోస్తుంది. అట్టియత్నం చేసిన ...ర్వాతకూడా సహృదయులకు అర్థంలేని అశ్లీలవాఙ్మయంగానే తోచేటట్టు ఉంటే, ...రు దాన్ని వదలివేయవచ్చును. లేదా వారికి యుక్తమని తోచిన ఏమార్గ ...మైనా అవలంబించ వచ్చును. అభ్యంతరం లేదు.

## న వ్య సా హి త్య ప రి భా ష

నవ్యసాహిత్యనిర్మాతలు ఏర్పరచుకొన్న రచనలలోని పరిభాషను గురించి ఒక మచ్చువాక్యం ఉదాహరిస్తాను.

చూచుచుండియుఁ గన్నులు సూడవయ్యె
తలచు చుండియు దలపులు తలచవయ్యె
పరమశూన్యం బయిన యాయవస్థ యందు
పట్టికొంటి దృశ్యాదృశ్యభావ మొకటి
క్షీణచంద్రికలను ప్రకాశించు రేయి
నాకుగాటుక పూసెనో నాగ దోచె.

ఇది రాయప్రోలువారి స్వప్నకుమారములోనిది. ఇందులోని పట్టికొంటి దృశ్యాదృశ్యభావ మొకటి - అన్నవాక్యాన్నిగానీ, క్షీణచంద్రికలను-అన్న వాక్యంలోని ...కాటుక పూయడాన్ని గానీ, శబ్దరత్నాకరం సాహాయ్యంతో విడకొట్టడానికి వీలు లేదు. కవియొక్క మానసికస్థితినిన్నీ, దాన్ని వెల్లడించేందుకు అతడేర్పరచుకొన్న పరిభాషనూ మనం గమనించాలి. లేకుంటే-"భావం అనేది మనోధర్మంకాదా? పట్టుకోవడం అనేది బాహ్యోపకరణమైన చేతిపనికాదా, అసలు మనస్సు నీరూపం: ...రూపంలేనిదికదా? దానినుండి బయలుదేరిందికూడ నీరూపమే అగునే, ఎల్లా దాన్ని ...ట్టుకోవడం?"అని శంకించి, ఛీఛీ అనడానికి సిద్ధపడినయెడల, ఈ సహృదయుణ్ణి ...లా తృప్తిపరచడమో ఆలోచించండి. మరొక ఉదాహరణం చూడండి:–ఇది ...కృష్ణశాస్త్రిగారి అన్వేషణం లోనిది.

చూచితివా లేదా చిన్నికృష్ణుని సొబంగు
పెదవి చివురుసంజల నరవిచ్చునవ్వు
వెన్నెల, చలించు తుమ్మెద బెళుకుచూపు,
లోల పవనచాలిత కుటి లాలకమ్ము.

ఇందులోని రెండోపాదం చూడండి. పెదవి చివురు సంజల నరవిచ్చునవ్వువెన్నెల- దీనిని నేటి విమర్శకులు చేపట్టి, 'పెదవిచివురూ-పెదవి అనేంటి చిగురుటాకుయొక్క' అనిఅర్థం చెప్పి, "సంజ అంటే సంధ్యాకాలంకదా!, సంధ్య-దీనికి వికృతి సంజ" అని హైస్కూళ్లలో ఆంధ్రోపాధ్యాయులం బోధిస్తాము. కాబట్టి, పెదవి చివురులలో సంధ్య ఏమిటయ్యా? ఒకవేళ సంధ్య తెచ్చుకుంటాడేపో అందులో నవ్వు అరవిచ్చడం ఏమిటీ? అని సాగదీసికొని కూర్చుంటే, వారిని ఎవరు సమాధానం చెయ్యగలరు? కాబట్టి కవితాస్వాదనశీలం గల సహృదయులు, ఇట్టి పనికి పూనుకోరు. అసలు నవ్య కవిత్వందాకా అక్కరలేదు. పురాణయుగంలోని ఏ పద్యం తీసినా వెక్కిరించి వేళాకోళం చేయవచ్చు. ఇదుగో మరో ఉదాహరణం చూడండి. ఇది తెనాలి రామలింగని కవిత్వం. పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మ వంశవర్ణనము.

ప్రసగువిత్తువంటి నెఱపాఱుకులంబు
  ను... ..వేదముల్ వోసినగాదె
శాస్త్రములు డాగినరచ్చ
  కళాకలాపముల్ డాసినరచ్చ.

దీనిలో వేదాలు పోసినగాదె ఏమిటి? వేదాలు పోస్తారా? కళాకలాపాలు డా రచ్చ ఉంటుందా? అని నా అజ్ఞానం వెల్లడిచేసికోవడమేనా? లేక నేను అందలి నుడికారపు సొంపును బోధపరుచుకోవడానికి ప్రయత్నం చెయ్యవలెనా? ఏది యుక్తమో చెప్పండి. ఏపాటిసహృదయత్వం ఉన్నా, ప్రయత్నించి అర్థం చేసికోవాలె. నవ్యసాహిత్యపరిషత్తువారు కూడా మరికొంత శ్రమ తీసుకొని గతానుగతికంగా దూషణల పాల్పరుస్తూ ఉన్న ఈయీ లోకాన్ని తృప్తిపొందించవలసికూడా ఉన్నది. కాబట్టి విమర్శకసోదరులనూ జ్యేష్ఠ కనిష్ఠసోదరులనూ "మీకు నచ్చిన గౌరవించవచ్చును. లేదా మానవచ్చును. కాని అకారణంగా నవ్య సాహిత్య నిర్మాతల మనస్సమాధిని చెడగొట్టవల"దని అంజలి చేస్తాను.

సంగతి కూడా ఉంది ఇక్కడ గమనించవలసింది. పూర్తిగా పదిశతా కాలం- అంటే వెయ్యిసంవత్సరాలు- గడిచిన పురాణవాఙ్మయంలోనే ఎం మంచమంతా చిల్లులే! అన్నట్టు ఉంటే. నవ్యసాహిత్యరచన ఆరంభమై ర్తిగా పాతికఏండ్లయినా దాటని ఈస్థితిలో- ఈకత్తులు దూయడం, ప్రభు త్వానికి అర్జీలూ సర్జీలూ పంపుకోవడం, నాబుద్ధికేమీ యోగ్యవర్తనగా తోచడం ఈవర్తనాన్ని ఆలోచిస్తే, ఎల్లాఉన్నదంటే- ఏడాది పసిబాలురను బలాత్కా గా అడుగులుపెట్టడానికి ప్రోత్సహించి, తప్పటడుగులు పెడతారా? అని ముదు లు విరుగగొట్టడానికి సిద్ధపడడంలాగ ఉన్నది. ఇంతవరకు ఈసాహిత్యము జనసా మాన్యంలోకి వ్యాపింపలేదు. మొన్న మొన్నటిదాకా, మడికట్టుకొన్న విశ్వేశ్వరీయ వాఙ్మయమే ప్రచారంలో ఉండెను. దీనికి వ్యాప్తిగానీ పఠనాలుగానీ, చివరకు చితంగా దర్శించుకొన్నా అమృతాంజనం సాహిత్యంమీద ఉన్నపాటి- అంటే మృతాంజనం ప్రకటనకై ఇటీవల బయలుదేరుతూఉన్న పాటలకున్నంత- మోజు యినా, మనవారికి లేదుకదా! ఈస్థితిలో మధ్యవారి నిరోధకయత్నాలు చూస్తే ప్వదా మనిపిస్తుంది, కాని నవ్వురాదు.

ఈ సందర్భాన్ని ముగించి నవ్యసాహిత్యంలోని రత్నాలను ప్రదర్శించడానికి ముందుగా మరొకవిషయం కూడా తా మందరూ చిత్తగించాలి. ఇది మరీ ముఖ్య మైన విషయం. పురాణసాహిత్యనిర్మాతలందరికీ వారు పురాణాలు తర్జుమాలు చేసే ప్పుడుగానీ, లేదా పురాణాలు ప్రబంధాలరూపాన పెంపొందించేటప్పుడుగానీ, నేటి వారికున్న కష్టపరిస్థితులు ఆనాటివారికి లేవు. వారికి ఆదర్శంగా సంస్కృత పురా ణాలూ సంస్కృత కావ్యాలూ సంస్కృతంలోని లక్షణగ్రంథాలూ ఉన్నవి. జాతీయ మైన తెలుగులో అనువదించేటప్పుడు సరియైనపదం లేకుంటే, ఆ మాతృక ఉన్నపదం అల్లాగే ఘువులతో జోడించి కొట్టేవారు. చూడండి:- గమికర్మీకృతనైక వృతః. ంటే, వీలిస్తే తెలుగువాడేవారు. లేకుంటే గమికర్మీకృతనైకనీవృతు నై - అనేవారు. అంతతో వారికి ఆబెడద వదలిపోయేది. నవ్యసాహిత్యనిర్మాతల ట్లు కాదు. వారు అభ్యసించినవీ అనుభవంలోకి తెచ్చుకోడానికి ప్రయత్నించేవీ దేశీకపుభాషలూ భావాలున్ను; వాటిని ముందు మాతృభాషాభ్యస్తములయిన ు మనసులోనికి ఎక్కించుకోవాలె. ఆ పిదప ఆభావాలను తాము భావనాపథం ో భావించిన రూపానికి తగినట్టి ఆవిష్కృతితో వెల్లడింప బూనుకొనవలెను. తమ

సాహిత్యంలో మూలానికి తగ్గిపోని అందాలను దిద్దివలెను. ఇదీకష్టం. ఇక ప్రౌఢమైన సంస్కృత సమాసరచన అందామా! పురాణ సాహిత్యం దీనికి తీసిపోకున్నది. చూడండి:—

కాంచె నైష్వష్ణుఁ డర్ధయోజన జటాఘూటోత్థ శాఖోపశా
ఖాంచజ్ఝాట చరన్మరుత్ప్రియ దవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీటకృత పత్త్రిణచ్ఛలన లిప్యాపాదితాధ్వన్యసి
స్సంచారార్త మహాఫలోపమ ఫలస్ఫాయద్వటక్ష్మాజముఁ.

స్యందనస్థిత బిడౌజః తుత్త్ర జాడ్యకృజ్జంఝామరు ద్గరుజ్ఝాంకృతములు
క్రవ్యాశి రాడ్గాత్రి కనదసృగ్గాహన స్ఫుటశల్య హవ్యభుక్ఫూత్కృతములు
యోధవర్మిత హృత్పుటోత్థాంత్రింత నిజపాత సాలాశ్మకృతమువహుస్థ్యార్తృతములు
పతితోగ్రరథః కబంధ భారభృశార్తి భుగ్నభోగ ఫణీంద్రఫూత్కృతములు.

మరో అనవకాశం కూడా ఇక్కడ వీరికి ఉన్నది. ప్రాచీనుల కృతులన్నీ అఖండ కావ్యాలు-అంటే ఏమన్నమాట? వారిగ్రంథాలలో భావాలకు స్థాయి కలిగించి రస స్ఫూర్తిని ప్రకటించడానికి వారి కావ్యశరీరం విస్తృతమై ఉన్నది. వీరివి అట్టివి కావు. ఇవి అన్నీ కూడా ఖండకృతులు. పరిమితమైన కావ్యశరీరంలో, రసాంగము లగు విభావానుభావాదులు సమగ్రంగా గ్రహించడానికి అసలు వీలివ్వవు. అందు చేత వీరి కవిత్వమునందు రససంపద కొరవడదు. ఏదో ఒకభావాన్ని ఆధారము చేసుకొని, అల్పావకాశంలో పూర్ణంగా రససిద్ధిని చేకూర్చేయత్నం వీరు చేస్తారు. నవ్యసాహిత్యం చప్పన మనసునకు ఎక్కకపోవడానికిన్నీ, భావన చేయగలిగితే రససిద్ధి ఏర్పడడానికిన్నీ, ఇది ఒక కారణంగా ఉన్నది.

ఈ విధంగా చూస్తే-నేను చూడను కనను వినను మూర్కోనూ అని కూర్చున్నవారికి తప్ప-తక్కిన అందరికిన్నీ, ఏమాత్రం భావనాశక్తిని వినియోగింప గలిగిన రసజ్ఞత ఉన్నా-అందలి సారస్యం గోచరింపక తప్పదు. అట్లుగాక భావక త్వమా అభావకవిత్వమా అని, ముందే కలుషితములయిన చిత్తాలతో, చూచ ప్రతివాదూ-సంస్కారిగా ఉన్నా అసంస్కారిగా ఉన్నా, నిలవబెట్టి ప్రశ్న విమర్శకంమన్యుల కువాదాలకున్నూ, పత్రికాధిపతిత్వంతో పాటు తన్ను ప్రవ నేతగా తలచుకొని వ్యాఖ్యానించే వ్యాఖ్యానవాచస్పతులకున్నూ, పాఠశాలా,

పాధ్యాయత్వంతో రొమ్ము విరుచుకొనే నాలాంటి పండితాగ్రేసరులకూ విద్యాశేఖరులకూ కూడా, ఈ నిర్మాతలు జవాబు ఇవ్వకుండా ఉపేక్షించడమే యుక్తమనిపిస్తుంది. కాదు, జవాబు ఇవ్వవలసిందే-అనేటట్టుగా ఉంటే, ఇదిగో అంజలిపట్టి మనవి చేస్తున్నాను:-

కవితాలతాంగికి కర్ణభూషణమైన
          కలువ మీచే బడి నలగిపోవు
మీకృతికన్యల కీకుందనపుదళ్కు-
          నగలు కైసేయు పుణ్యంబు కలదె
ఈవలిగాడ్పు మిమ్మావహించిన దవ
          జ్వాలలీనునె కాని సౌఖ్యమిడదు
తీయనియీ గండుగోయిల గానమ్ము
          వెగటాయె నౌర మీవీనుగవకు
ఈతుషారజలమ్ము మీ చేతులంటి
మలినమైపోయె కొనకున్న మానె, పొందు
సుకవిభోగ్యమ్ములీచటివస్తువులు వీని
నలిపివేయకు డటునిటు గలచివైచి. (కాటూరి-పింగళి.)

నవ్యసాహిత్యరత్నాలు

ఇక నవ్యసాహిత్యంలోని కొన్నిరత్నాలు దిగ్దర్శకంగా ఉదాహరించడమనే పని నిలచి ఉన్నది. ముందు మరోపని ఉన్నది. ఈ నవ్యసాహిత్యమంతా ఇంగ్లీషులోని ఉత్తమోత్తమకవుల యొక్క భావాలను అనుకరించడమే గాని మరొకటి కాదు. ఆ అనుకరించడమైనా చేతావాతాగాని అనుకరణాలు, అని కొందరు కొందరు ఎప్పుడూ అక్షేపిస్తారు. అయితే ఇక్కడ రెండువిషయాలు ఆరోపింపబడుతున్నవి. ఒకటి-పరభాషల్లోనుండి అనుకరించడం తప్పనిన్నీ, రెండు-అల్లా అనుకరించక తప్పనప్పుడు, ఆవాఙ్మయాల తీరుతీయములు తెచ్చేశక్తి లేకుండా పాడుచేయడం అన్యాయ్యమనీ. ఈ రెండింటిలో, నేను ఇంగ్లీషు వాసనకూడా లేనివాడను కాబట్టి రెండోదాన్ని నిరూపించడం తప్పా? అనేవిచారణ మీకే వదలిపెట్టి అసలు అల్లా అనుకరించడం అపహరణమనే నేరంక్రింద జమకట్టవచ్చునా? అనేదాన్ని గురించి కొంచెం చెబుతాను. ఈ అనుకరణం అపహరణం క్రిందికి వస్తుందా కాదా? అని విచారణ

చేయడానికి ముందు, ఇట్టి సంప్రదాయం మనలో ఉందనిన్నీ 'నీవు చెప్పిన విద్యయే నీరజాక్ష' అన్నట్లుగా అది సర్వాత్మనా మనవారికి సనాతన సత్సంప్రదాయమే అనీ, కాబట్టి మనవారి మడిబట్టలకు ఏవిధమైనహానీ రాబోదనీ, మనం అభయం ఇవ్వ వచ్చును. ఇక ఈ అనుకరణ సంప్రదాయం చిత్తగించండి.

సంస్కృతంలో, వేదాలలోనుండి:—'యదేతద్మ న్మండలం తపతి, తన్మహా, స్త దుక్థం, తాఋచ, స్సఋచాం లోకోఽథ యదేత దర్చిర్దీప్యతే, తన్మహావ్రతం, తాని సామాని, ససామ్నాం లోకోఽథయ ఏవ తస్మిన్మండలే పురుష, సోఽగ్ని, స్తానియజూగ్ంషి, సయజుషాం లోక స్సైషా త్రయ్యే విద్యా తపతి'

దీనిని మయూరకవి ఇల్లా కావ్యభాషలోకి అనువదించాడు:—

శ్లో. ఏతద్యన్మండలం ఖే తపతి దినకృత స్తా ఋచోర్చీంషి యాని,
ద్యోతంతే తాని సామాన్యయమపి పురుషో మండలేఙుర్యజూంషి,
ఏవం యం వేద, వేదత్రితయ మయమముం వేద వేదీసమగ్రో
వర్గ స్స్వర్గాపవర్గప్రకృతి రవికృతి సోఽస్తు సూర్యశ్శ్రియై నః

ఈ విధంగా, మనవారు శ్రుతుల్లోనుండీ, స్మృతుల్లోనుండీ, పురాణాలు ఇదిహాసాలు తర్కవ్యాకరణాది శాస్త్రాలు, ఇదేమి అదేమి, సమస్తవాఙ్మయములనుండీ సమస్తమూ అనుకరించుకుంటూవచ్చిరనిన్నీ, అనుకరణమనేది తర్వాతి తర్వాతి కవులకు పూర్వ పూర్వకవుల గ్రంథాలు చదివిఉండటంచాతనున్నూ, వానియందుఉండే గౌరవబుద్ధ్యానూ ఏర్పడుతుందేగాని, అపహారణబుద్ధ్యా కాదనిన్నీ, రాజశేఖరకవి కావ్యమీమాంసలో స్పష్టంగా వివరించాడు. గ్రంథం పెరిగిపోతుందనే భయంచాత ఒక్కటే నేను ఉదాహరించాను. మిగతా అందులోనే చూడండి. ఇక తెలుగుకవులను చూడండి మచ్చుకు.

సీ. నటదీశహాస విస్ఫుటిత వేధోండకే
ఖల దోచువరణాంబుకణికలనఁగ
పెల్లుబ్బు నిర్గపెన్వ్రేల్లి నెల్లపదార్థ
ములుమున్గఁ బొడము బుద్బుదములనఁగ
రవికి మందేహ నిర్మథన సాధనములై
వచ్చిన ద్విజమంత్ర వర్ణములన

హరిపదంబును నీశు శిరమునైన నభంబు
　　　　ననభోగతులనించు నన లనంగ
చరమ గిరి యను మరకాడు జలధిసరణి
తరణి డించిన నతడు తత్సలిలమగ్న
విమలముక్తాఫలంబులు వెలికి జొనిపె
ననగ నవతారకా నికాయంబు లమరె. వసు. 4. 15.

ధ్వాంతదంతావళోత్కర పుష్కరోద్ధూత
　　　　గగనగంగాపయః కణములనఁగ
శర్వతాండవ దిదృక్షా నమాగత నిర్జ
　　　　రీమహా మౌక్తిక శ్రేణులనఁగ
నభ్రకళిందజా ప్రవాదముననిండార
　　　　విరిసిన తెలికల్వవిరులనంగ
భావి నిశా చంద్రపరిణయంబున కిడు
　　　　దిక్కుడ్యముల పిండిచుక్కలనగ
క్రిక్కిరిసె నొక్కమొగి నెల్లదిక్కులందు,
క్షీరఘనసారపాటీరతారహార
హీరపారదనారదశారదాభ్ర
గౌరరుచిమీరఁ దారకా వారమపుడు. కవిజనరంజ. 3_63.

ఇలాంటివి లక్షలు ఉన్నవి. బ్రహ్మశ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారి వసుచరిత్ర విమర్శనమును చిత్తగించండి అందులోవారు ఈఅనుకరణాలను ఏరి, ఒక్క చోట చేర్చి పెట్టారు. కనుక అభ్యస్తమైన వాఙ్మయాల అనుకరణం ఎంతటివారికీ తప్పదనిన్నీ, అది అనువదించిన తర్వాత కొత్తవాడు చదివితే వాడికి ఆభావాలు స్ఫురించేట్టు ఉంటే చాలనిన్నీ, అట్టిది నాకు పీఠికవిత్వంలో స్ఫురిస్తున్నదనీ మనవి చేస్తున్నాను. ఇక నవ్యసాహిత్యంలోని రత్నాలు చిత్తగించండి.

*
* *

# షణ్ణవతి

* నోరి వెంకటరామశాస్త్రికి *

నోరి నరసింహశాస్త్రి

రాజు

ఘల్లని గజ్జెలు క్వాణనము చేయగ
కాల దన్నె నెద, స్వామీ,
నిజఘనఘంటా నిస్వనంబుతో
నింపె శ్రోత్రములు, స్వామీ!

పాలుగారు యువవటుని శిరమ్మొక
పాణి దాల్చినది స్వామీ,
కాలానల పటు కౌక్షేయక భర
కరమటు చూపెను స్వామీ!

ఆఘూర్ణిత రక్తాస్యముతో న
ట్టాట్టహాసమే చేసెన్,
అంచితసుధా దృగంచల కాంతుల
నించెను నన్నే స్వామీ!

సర్వాలంకృత జగదంబిక సా
క్షాత్కరించినది స్వామీ,
సంభ్రమ భయ హర్షంబుల నామెకు
సాగిలి మ్రొక్కితి స్వామీ!

అఖిలాంగము రోమాంచముసు నాకిం
కణగిపోదు గురుదేవా,
ఆత్మనేత్రముల నానందాశ్రువు
లారలేదు గురునాథా!

పరమ శోభనము భవదీయాంఘ్రికి
ప్రణమిల్లెద నిదె స్వామీ,
పరమశాంత మీ పాదపద్మమును
భజియించెద గురుసింహా!

గురువు

జయము జయమో క్షత్రసింహా,
జయము జయమో జనవరేశ్వర,
పావనంబీ బ్రాహ్మవేళను
పలికె జగదంబ.

తుంగభద్రాతోయ కమలజ
తుందిలం బీ మందపవనము
మలయుచున్నటు మధురవాక్కుల
పలికె జగదంబ.

సకలరిపు రాజన్యమండల
సంక్షయార్థము సంభృతమ్మౌ
చండికా యజ్ఞంబు నేడిక
సఫలతం గనెను.

ప్రాణములు బిగబట్టి యాత్మను
పరమ శివ భావంబులో నిడి
నేడు హోమము నియత విధమున
నెరపగా వలయున్.

నిజధనావళి నిఖిలబంధుల
నిభృత సత్కృతినిచయ మంతయు
తదవసరమున తత్పరత నా
తల్లికీయవలెన్.

పరమశాంతము పరమపూతము
పరశివాత్మము పశువు నీవలె
చండికాంబా శాంతికై ని
స్సంశయంబుగను.

రాజు

స్వామీ, నిర్భర సంతోషముతో
సంభ్రమమేదో పెనగొనెడిన్
భావాలు పొంగెడి పరమోత్సాహత
భయ మిటు గదిరెడి నెదలోనన్.

శ్రవణపర్వమై జయజయ ఘోషము
రణణంబయ్యెడి దిశలన్
ఛురికాగ్రంబున చూడిన యట్టులు
చురచుర మండెడి నెడదన్.

పరమ భద్రమై పరశివరూపము
పరగెడి చతుర్వీధిన్
కాలాంజన సంకాశాకృతి ఎదో
కలవర పరచెడి నడుమన్.

భండనముల బీభత్సరూపములు
వందలు వేలుం గందున్
వీరోత్సాహము పిచ్చలించునే
వెరపెరుగనె ఇటు దేవా!

గురువు

సంగరంబుల క్షాత్రసాహస
చర్య లెరుగుదు జనవరేంద్రా,
దీక్షితద్విజ శిక్షకనె దీ
నము రాజేంద్రా!

బాల్యమాదిగ పరమ శివపై
భాగ్యవశమున భావమొదవెను

ఆమె సేవకె అర్పితము
అరువ దేడులును. తేది..........

వేదశాస్త్ర వివేక మంతయు
వితతకర్మ నివేశ మెల్లను
ధర్మనిష్ఠయు తల్లిపూజకె
తర్పితం బాయె.

అంబికాసేవార్థమేనే
నాత్మపత్ని వివాహ మాడగ
ఏకపుత్రికు నిచ్చె కేశవు
నిద్ధతేజస్విన్.

దేహమే దేవాలయంబుగ
ఆత్మ జగదంబైక బుద్ధిని
జీవితము శ్రీయాగ మట్టులు
చెల్ల నిచ్చితిని.

జగ దసారత జ్ఞాత మైనది
జ్ఞానులకు నశ్రాంతి గూర్చెడి
మూలమాయా పూర్ణకృపచే
పుత్రరక్తి వినా.

తల్లి నమ్మిన తనయునకు ని
త్తరుణమున సంతానమోహము
వెడల నడపదె విచ్చి మాయా
విపుల గ్రంథులను.

రాజు

సాహసమేదో సంకల్పిత మని
స్పష్ట మయ్యె గురుదేవా,
ఊహించుటకును నులుకుచుంటి భవ
దుద్దేశము గురునాథా!

స్వామీ, సద్గురు చరణము దొరికిన
స్వారాజ్యం బది యుండఁగ
ఏటికి కలిగిన దిహారాజ్యముపై
ఇచ్ఛ వీని కిటు దృఢమై!

అంతరశత్రుల నరిగొన జాలు న
వార్ణమంత్రము లభించెఁ
శాత్రవరాజక సంహారాత్మక
సంకల్పంబిది యేలా!

ఆజన్మము కామ్యార్థము పూజయు
నాచరింపరే మీరల్,
ఆచార్యత్వం బర్థించితి నీ
యాగంబున కిది ఏమీ!

భవదకారణ కృపాప్రవాహములు
ప్రసరించిన నిట్లరుదై
తద్రభసంబును ధరింప వీనికి
దార్ఢ్యమున్నె గురునాథా!

గురువు

వత్స, ఎవరికి వరశివేచ్ఛల
వచ్చు దరవగ వ్యర్థ నరులకు
వాని నడ్డుట పాపకృత్యము
వ్యర్థయత్నమ్మగు.

అతితరాల్పము లాత్మదృష్టులు
అంబదృక్కులో అపరిమితములు
అంబదృక్కుల నాత్మదృష్టి స
మన్వయింప వలెఁ.

శస్త్రవైద్యుని శస్త్రము మల్లే
శస్త్రప్రయోగము జనని కరమున
జనని శస్త్ర స్పర్శ సర్వము
శాంతపూత మగుఁ.

హాసమిశ్రము లంబవాక్యము
లాత్మ యిప్పుడు నాలపించెడి
వేణుగర్భము విజనభూమిని
విన్న శ్రుతిరీతిఁ.

జలజలను సుధ సెలవిధంబున
నెలల బుడుతని నిండు నగవటు
పలుకు లిపుడును గిలిగిలించుచు
చెలగు కర్ణములఁ.

ప్రియత చిత్తుడు ప్రియుం డస్మత్
భక్తవరులను పరమ భక్తుడు
ఇచ్ఛయమె నిప్పింపు కేశవు
నిందు బలి యనియెఁ.

ఇట్లనుచు
ఘల్లురని నగియెఁ

ఘల్లు రని యా తల్లి నవ్వగ
ఝల్లు రనె నా సర్వకాయము
తత్క్షణమె చైతన్య ముడిగెను
తనువునం దట్టే.

పరమహర్షమొ పరమదుఃఖమొ
ఎరుగ నిర్వర్ణింప దానిని
ఆ యవస్థే యగునో ద్వంద్వము
లంగవేసినది!

అంబికేచ్ఛాపాంగ కింకరు
లజహరాదు లనంతకోటులు
ఆమె యాజ్ఞల నవును కాదన
నగునె మన కార్నా!

బుద్ధి గలచెడి మూఢ శంకల
పొడిచివేయుట బుద్ధియోయీ,
పేరురంబున పెరిభయముల
పెల్లగింప వలెఁ.

మంత్రవిధి నల మాతృకృపచే
గొంతులో దగ్గుతిక పొడమదు,
చేత దృఢముగచేయు మసి బలి
ఛేదనంబునకు.

రాజు

సునిశిత శిక్షిత సూక్ష్మ వాక్యములు
చొరవు వీని చెవి స్వామీ,
ఎదలో భయమును మదిలో శంకయు
వదల లేదు గురువర్యా!

పురుష నిశ్చయము భూరికఠిన మై
తిరుగుట ఎరుగదు దేవా,
వచ్చెడి నదె గురుపత్ని యామెనే
ప్రార్థించెద నో స్వామీ!

తలపున తలచిన తత్క్షణమునసే
దర్శన మొసగితి తల్లీ,
అంబిక సాక్షా దవతరించె భవ
దాకారంబున జననీ!

అభివాదన మిదె యాచరింతు గొను
మాదరమున గురుపత్నీ,
సోమవర్మ డను సుతుడ నీకునే
చూడు నన్ను కృప మాతా!

ఆచార్యేంద్రు కటాక్షవీక్షణ మ
హత్త్వ సిద్ధిచే తల్లీ,
నిర్విఘ్నముగా నెరవేరిన దీ
నిస్తుల యాగము తల్లీ!

యాగశాంతియే అవశిష్టం బీ
అహరవసరమం దమ్మా,
కలలో నంబిక కనపడ వీనికి
పలకరించె గురువరులా.

భవాని యడిగెను భవదీయాత్మజు
బలిగా కేశవు దల్లీ,
ఆచార్యం డది యవశ్యకర్త
వ్యం బనియెనే నో తల్లీ!

పటు దృఢ సుదీర్ఘ బాహువు లియ్యవి
కటువులు వైరుల వట్లన్
ఆచార్యాత్మజు హననక్రియ నివి
అలతులు భీరువు లమ్మా!

జ్వలన తీక్ష్ణమీ శాతకృపాణము
శత్రుశిరః కర్తనలో
కోరలు పెరికిన కోడెత్రాచునుమి
గురుపుత్రకు నెడ తల్లీ!

యువకుడు విద్యా యుక్తుడు బ్రాహ్మణు
డుత్తమోత్తముడు మహిమన్
గురుల కున్న యొక కుమారు డీతని
గురిచేయుట బలికెట్టుల్?

సద్గురుపాదుల శాంతకృపామృత
చరిత మెరుంగుదు తల్లీ,
నిర్ఘృణ నిశ్చయ నిర్వర్తనలో
నిమ్మంపము వెర గయ్యెన్.

మధుర మనోహర మంజుల భాషల
మాన్పవె గురు నిశ్చయమున్,
శరణను దాసుని సంప్రార్థన విని
సంరక్షింపవె తల్లీ!

రాహు సంగ్రసిత రాకాహిమకరు
రాణ నేల నో తల్లీ,
భూభ్రంగం బిటు పూనెదు ముఖమున
పూర్ణకృపాసుధ కాకన్?

అమ్మ, ఇపుడు నీ యోగాకారము గన
నతిభయ మయ్యెడి నయ్యో,
కలలో గాంచిన కాళీరూపమె
కనబడు చున్నది నీలో.

గురుపత్ని

ఈరీతి గురుపత్ని నేమిటికి మాయలో
నిరికింప జూచెదవు రాజా,
రాజరాజవు,నీవు రాజగురువులువీరు
రాజాధిరాజ్ఞి దాయాగమిద్ది.

అవ్యాహతాజ్ఞుండవౌ ప్రభుడ విందున్న
అఖిల ప్రజకు నీవు, రాజా,
తత్త్వవేత్తలు సర్వతంత్రస్వతంత్ర వి
స్తార ధీరులు గురులు రాజా!

అంబికా పరతంత్రితాంతః కరణవృత్తు
లశ్రాంత మాచార్య దేవుల్
ఆచార్య పద సరోజారాధనల నెప్పు
డప్రమత్తాత్మ నో రాజా!

పతి ఇచ్చ కెల్లపుడు పరతంత్రనై యుంట
స్వప్రతిభ ఎరుగ నో రాజా,
పతియాజ్ఞ వేదంబు పతి ఇచ్ఛ ధర్మంబు
పతిసేవ శ్రీయాగ మోయీ.

శ్రుతి మేళవించితిని శుద్ధాత్మ వీణ నా
పతి స్వేచ్ఛ గానములు చేయన్,
బాధింపు మనెదే యపశ్రుతులతో దీని
స్వప్రగల్భము చూపి రాజా!

స్వామి తేజఃపుంజ సత్త్వ దని కేశవుడు
సమ్మోదసంధాయి నాకున్
కన్నకడుపనిలేదుగర్వమోహము సుంత
కాంతు డొసగిన భిక్ష పట్లన్.

పరమాత్మ కెంతకృప వ్రతులపై పతికంత
పరమ వాత్సల్యంబు నాపై,
అంత వాత్సల్యంబు కధికంబు కేశవుని
యందు నాస్వామి కో రాజా!

భక్తులకు పరమాత్మపై ప్రేమపరవశత
పారం బెఱుంగుదువె రాజా,
అంతకంటెను ప్రేమ మధికంబు కేశవుని
యందు నా స్వామి కో రాజా!

ఆచార్యునిశ్చయములా కాంక్ష చేయ నా
కధికారమేమున్నది రాజా,
పూర్ణధీ వారిధిని పోల్చమందువా చిల్లి
బుంగ బుద్ధిని గొల్చి రాజా!

రాజు

అనధికారి నీ యోగం బేటికి
నారంభించితి, నయ్యో!
రాజ్యతృష్ణ పరరాజ జిగీషయు
రా విప్పుడు మది స్వామీ!

బాల్య మాదిగా భావ వివర్ధిత
పరిణత కాంక్షలు మానెన్
సన్యస్తుడ నిక చాలింపగ బలి
స్వామీ, యనుమతి యీవే!

పసివా డడిగెడి వ్యర్థవాంఛలకు
పరిణతుండు నగు నట్టుల్
ఎలనగవున నను హేళనచేసెద
రేటికి నిర్దయ స్వామీ!

గురువు

వత్స మోహము వదలిపోయిన
వారు సుకృతులు భాగ్యవంతులు

చండికేచ్ఛల జరుప వారికి
సంశయము లున్నే!

జ్ఞాని చిత్తము లేని బలవం
తాన మోహాము లోని కీడ్చెడి
ఆ మహామాయాంబయే ని
న్నోమ గావుతను.

డోలికాగత బాలకుని యాం
దోలనము మతి తొలగ ద్రోయుము
పూన్చు దృఢముగ పూన్కి శీఘ్రమె
బుద్ధి ధర్మమునన్.

రాజు

స్వామి, కేశవుడు సాక్షాత్పావకు
చందము వెలుగుచు నిడుగో,
షోడశాబ్దముల సుందరరూపుడు
చూడ ముచ్చటలు గొలుపున్.

పూర్ణదీక్షనే వ్రతము చేసిన
పుణ్యాత్ముండీ వటుడు
ఇట్టివాని నెటు లియ్యెడ బలిగా
నిమ్మనెదో సెలవిమ్మా!

కేశవుడు

అమ్మా, కేశవు నభివాదన మిదె
ఆశీఃకాముడనే యమ్మా,
మ్రొక్కెద తమ పదముల కిదె తండ్రీ,
ముందు వినుడు నా కలవరమున్.

మూలాధారము మునుకొని మూర్ధం
మునకెగబ్రాకెడి నేదో,
పాము బుస్సు మని పడగెత్తినయటు
చీమల బారటు ప్రాకి నటుల్.

దేహం బేదో దివ్యశక్తి ను
ద్దీప్తం బై నటు తోచెడిని
పొరి పొరి తనువున పులకాంకురములు
పుట్టి యెల్లెడల పొడిచెడిని.

విద్యుత్స్పర్శము విధమున నేదో
వివిధాంగంబుల వేధించున్
ఆపిన నడగక ఆవేశం బెదో
అలజడి పరచెడి స్వాంతమ్మున్.

కరుణామృతములు కార్చు నీకనుల
కటాక్షముల తమి శమియించెన్
స్వామీ, నిర్భర సంశ్లేషమ్మున
స్వాంతోచ్ఛలనము శాంతించెన్.

గురువు

వత్స, సుకృతివి పరశివేచ్ఛకు
పాత్రమైతివి ప్రకృతి మాయలు
నిన్ను చేయగనేర వలజడి
నిష్కామ మైన నికన్.

ముక్తి కుద్యత మూర్తి వేదో
పూర్వకర్మ విమోక్షణమునకు
ఉదితమైరా వుభయకులములు
నొందె పూతతను.

అంబ ఈ యాగావసరమున
అడిగె బలిగా నయ్యె నిన్నే
సంశయమునుతో జనవరేంద్రుడు
సంచలించెడిని.

కేశవుడు

ఏమీ స్వామీ ఇంత యదృష్టం
బేతన్మాత్రమున కబ్బె నాకో!

అంబికే స్వయముగ నడిగెనె బలిగా
నన్మన్మాత్రుని ఎంత దయో!

సంశయ మేటికి జనవర నాయెడ
శంకావర్తన సెల విమ్మా,
చెప్పుడు ప్రాయశ్చిత్తము పెద్దలు
శీఘ్రం బది నిర్వర్తింతున్.

రాజు

ఉత్తమ గురువుల ఉపదేశంబుల
ఊహా శంక విడదాయెన్
ఆచార్యాని మహాప్రబోధమును
అణచ దాయె మది శంకన్.

స్వామీ, కేశవు సంభాషణముల
శాంతించెను మది సంశయముల్
చండీకృపచే సమస్తభయమును
సమసెను చిత్తము లోనన్.

ఆచార్యా, భవ దాదేశం బిక
అనువర్తింతు నశంకన్
నిశ్చల కరముల నిలిచితి నిదెమీ
నియతి ఏమొ సెలవిండీ!

* * *

గురువు

వత్స, చేయుము పరశివాత్మక
పశువు పూజను భక్తి యుక్తిని
రిష్టి నభిమంత్రించి ఛేదన
ముష్టి నర్పించు!

రాజు

భాగ్యవశంబున ప్రాప్తం బైతివి
బలిరూపంబుగ నిందున్

చాముండికయే సంభవించినది
స్వయంబుగా నీ రూపమునన్.

సమస్తరూపిణి నమస్కరించెద
నమో నమస్తే నమో నమో,
చండీప్రీతిని సమస్త శత్రుల
జయింతు గావుత శీఘ్రముగా.

స్వయంభవుండే స్వయముగ యజ్ఞ
ప్రయత్నముకు బలి సృష్టించెన్
యజ్ఞంబున వధ అవధయగుట ని
య్యేదె నిన్నిప్పుడు ఛేదింతున్.

చండీ దుర్గకు సాక్షాద్రిసనవు
చంద్రహాసమా, నమో నమో!
అమ్మ, కాలికా, యజ్ఞేశ్వరి నీ
కభివాదన మిదె కొమ్మా!

చూచితె స్వామీ, చోద్యం బీ యెడ
శుద్ధసత్త్వుడీ కేశవుడు
కాళిక యాకృతి కాళిరూపమున
కలసి పోయి చూపట్టున్.

స్వామీ, మీదయ చండీయాగము
సమాప్తమైనది యీవేళన్
చండీ కృపచే సమస్త శత్రుల
జయింతు నిక నే త్రుటిలోనన్.

గురుదక్షిణయే కోరవడినది యీ
గురుతర యాగమునను స్వామీ,
అనుగ్రహింపవె యానతిచ్చి నీ
అభిమతార్థమును గురునాథా!

గురువు

దుర్గమం బీ దుర్గయాగము
నిర్గమించి తనర్గళంబుగ

దాని గాంచుటె దశగుణంబుగ
దక్షిణావాప్తి.

అర్థమెయ్యది యనుగమింపగ
అశేషార్థావాప్తి యగునో,
అధిగమించితి నా విరాగము
అంబికా కృపచే.

శ్రీవిరూపాక్షస్థ శృంగగిరి భారతీ
శ్రీపీఠ సింహాసనస్థుఁ,
ఆశ్రయించెద శంకరానంద భారతీ
యతి జగద్గురు పూజ్యపాదుఁ.

రాజు.

ఇకపై కేశవుడే నా కిమ్మహి
నిష్టదైవమై వెలయుఁ,
ప్రతిష్ఠ చేసెద పవిత్రభూమిని
పరమభక్తితో కేశవునే.

అర్పించెద బ్రహ్మార్పణముగ నిదె
అశేషరాజ్యము కేశవుకుఁ
కేశవదేవుని క్రీతదాసు డను
కీర్తికాముఁడే సోము డికఁ.



# తువ్వాయి

చింతా దీక్షితులు

తువ్వాయి తువ్వాయి ఏమి తువ్వాయి?
తువ్వాయి తువ్వాయి మంచి తువ్వాయి.
తువ్వాయి మెళ్లోను ఏమి ఉన్నాయి?
తువ్వాయి మెళ్లోను మువ్వ లున్నాయి.
తువ్వాయి నోట్లోను ఏమి ఉన్నాయి?
నోట్లోను తెలిపాల నురుగు లున్నాయి.
తువ్వాయి కాళ్లల్లొ ఏమి ఉన్నాయి?
తువ్వాయి కాళ్లల్లొ పరుగు లున్నాయి.
తువ్వాయి తువ్వాయి ఎవరి తువ్వాయి?
ఆవుగారి తువ్వాయి-అనలు మాతువ్వాయి.

# శాసనములలోని తెలుగుభాష

కుందూరి ఈశ్వరదత్తు

ప్రాచీనభాషాలక్షణము తెలుసుకోవలెనని కుతూహలపడే పండితులకు శాసనములలోని భాష, నాటి వాస్తవస్థితి తెలియపరుస్తూ, భాషాపరిణామమును ప్రస్ఫుటము చేస్తుంది. ఏనాడో మహారాజులు వ్రాయించిన తామ్రశాసనములు, శిలాశాసనములు నేటికీనిల్చి, మొట్టమొదట ఏలావ్రాసినారో, అలాగే చెక్కుచెదరక ఉన్నవి. ఏతాళపత్రగ్రంథములో అయితే, ఆయాకాలములనాటి భాష వాటిలో ఉన్నదున్నట్లుండక, క్రమక్రమముగా ప్రత్యంతరములలో అవతారములు మారి నూతనవేషము ధరిస్తూ ఉంటుంది. పండితుడైతే, భాషను తనకాలమునాటి వ్యాకరణసూత్రములు పరమప్రమాణములుగా గ్రహించి, పూర్వపాఠములు దిద్దివేస్తాడు. పండితంమన్యుడైతే, పాఠమును గుర్తించలేక, లేనిపోని నూతన పాఠములను చేర్చి క్రొత్తచిక్కులు కల్పిస్తాడు. ప్రస్తుతం పండితులు భారతపాఠములను బాలవ్యాకరణ సూత్రములను ఆధారము చేసుకొని దిద్దివేయడం లేదా? కాని శాసనములలోని భాషను దిద్దివేయడం ఎవరి వశం? అక్షరములను దిద్దివేయ తరమా? నిజముగా భాష అక్షరశబ్దవ్యుత్పత్త్యర్థమును దాలుస్తోంది. కాబట్టి ఆశాసనములలోని భాష ఆంధ్రభాషాపరిణామ పరిశోధకుల కత్యంతోపకారి అని మనవి.

### శాసనసంపుటములు - ఇనుపవెట్టె పదము

ఆర్కియాలజికల్ సర్వే వారి కనుగొన్న శాసనములను ప్రభుత్వమువారు సంపుటములుగా ప్రకటించినారు. అందులో నాల్గవ, అయిదవ, ఆరవ సంపుటములు చాలా ముఖ్యమైనవి. వానిలో తెలుగుశాసనములు చాలాఉన్నవి. ఈమధ్య ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రాచీన శాసనములలో నున్న పద్యములను సంగ్రహించి, 'శాసనపద్యమంజరి' అనుగ్రంథమును ప్రకటించినారు. ఈ ప్రాచీనాంధ్ర శాసనములలో మనకు తెలియవచ్చే భాషాలక్షణములు ఏమిటి? ఆధునికవ్యాకరణ సూత్రములకు భిన్నములైన ప్రయోగవిశేషములు ఏమి ఉన్నవి? ఆయాకాలములనాటి భాషాస్వరూపము ఎట్టిది? ఆప్రశ్నలకు, సమాధానము చెప్పుటలో శాసనసముదాయము నిఘంటునిర్మాతలకు, వ్యాకరణకర్తలకు, శబ్దశాస్త్రజ్ఞులకు ఒక పెన్నిధి వంటిది. ప్రస్తుతము

ంటువుల కెక్కని పదములు వందలకొద్ది వాటిలో ఉన్నవి. ఇప్పటివ్యాకరణ సూత్రములకు భిన్నములైన ప్రయోగములుకూడా వాటిలోగలవు. శబ్దలక్షణము లకు విరుద్ధములైన పదములెన్నో ఉన్నవి. కాబట్టి ఆంధ్రనిఘంటునిర్మాతలు శాసన ము లన్నిటినీ చదివించి, ఇదివరకు నిఘంటువుల కెక్కని పదసముదాయమును ఏర్చి, వాటి అర్థమును గ్రహించి, భాషాభివృద్ధికి తోడ్పడవలసి ఉన్నది. ఒక్క ఉదాహర ణము ఇస్తాను. ప్రాచీనశాసనములలో 'ఇనుపయెడ్లు' అన్నపదము సర్వసాధారణ ముగా కనిపిస్తూ ఉన్నది ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించిన 'శాసనపద్య మంజరి' లో గల శాసనములన్నిటిలో ఈ పదము సర్వసాధారణముగా కనబడు తుంది. ఈ పదమే కొన్ని శాసనములలో 'ఇనుంపెడ్లు' 'ఇనూపఎడ్లు' 'ఇనుపఎడ్లు' 'యినుపుఎడ్లు' 'ఈనుపెడ్లు' 'యిన్పుఎడ్లు' మొదలగు చిత్రచిత్ర రూపములను దాల్చి నది. ఈ ఎడ్లు దేవుడి నిత్యనైవేద్యాలకు నేయికొరకు ఇచ్చినవి. ఎంతచదివినను ఈ ఇనుపఎడ్ల వృత్తాంతము తెలియలేదు. మొట్టమొదట గేదెలుకాని, ఆవులుకాని కావచ్చును-అని అనుకుంటూ శాసనసంపుటములలోని ప్రతిశాసనమూ చదువగా ఒకచోట ఈ వాక్యము కనిపించింది.

"కాటియబోఇని కొడుకు మాదని వసమున విడిచిన గొఱ్ఱెలు 50. గుడ్డ్యబో యిని అరంగని వసమున విడిచిన గొఱ్ఱెలు 50. లెక్కకు రెణ్డు దివ్వలకు విడిచిన ఇన్పయెడ్లు 100." [1]

అనగా ఇనుపఎడ్లు అంటే గొఱ్ఱెలని అర్థము.

ఇనుపఎడ్లకు అర్థము గొఱ్ఱెలని నాకు తర్వాత ఇంకొక ఆధారము కనిపించింది.[2] ఇట్టి పదము లెన్నో కలవు.

ఈపదములన్నిటిని సంగ్రహించి నిఘంటువులలో జేరిస్తేనే, ఆంధ్రనిఘంటు నిర్మాతల కృషి సఫలమవుతుంది.

1. South Indian Inscriptions Vol V. No. 6?.

2. Epigraphia Indica Vol. VI P. 156,

"In Modern Telugu ఎడ్లు, the plural of ఎద్దు, means 'bullocks' but 'ఇనుపఎడ్లు' must be synonymous with గొఱియలు or sheep." దీనికి సరియైన ప్రమాణమును పైని ఉదాహరించి ఉన్నాను.

భాషావిషయము - వర్ణక్రమము

ఱ

పూర్వపు శాసనములలో గురురేఫము తరుచుగా ఉపయోగింపబడినది. మహత్తులగు పురుషవాచకములందును, స్త్రీవాచకములందును, అమహత్తులగు దేశ్య మృగ సంఖ్యా వాచకములందును ముఖ్యముగా ఉపయోగింపబడినది. ఉ॥ "చేబ్రోలు-పెఱంబత్తి-ఎఱియ-తెఱయు-" ఔపవిభక్తిక ప్రత్యయమును జేర్చిన పిదప వచ్చు గ్రామనామములలో చాలచోట్ల శకటరేఫమే వాడబడినది. "ప్రాంబత్తి" "పెనుంబత్తి నాథో" మొదలగు ఉదాహరణములు కలవు.

సంస్కృతశాసనములలో మధ్య గ్రామనామములు వ్రాసినపుడు అనాద్యమైన ఈఅలఘురేఫమె ఉపయోగింపబడినది. (South Indian Inscriptions Vol. IV. No. 1092) కాని క్రమక్రమముగా శాసనములలోనే వ్యత్యస్తమగు ప్రయోగబాహుళ్యము కనబడుతున్నది. కొన్ని శాసనములలో శకటరేఫ ముపయోగింపబడిన పదములకే మరికొన్ని శాసనములలో సాధురేఫప్రయోగములు కలవు. ఉ॥ ముందఱ-ముందర; నూఱు-నూరు; కూతుఱు-కూతురు; చెఱువు-చెరువు. ప్రాచీనాంధ్రశాసనములలో 'పాపంబు గొన్ఱు-గోత్రిన్ఱు-మూన్ఱు-ఇత్యాదితున్ఱు' మొదలగు పదములు కాన్పించుచున్నవి. పదాంతములందున్న 'న్ఱు' ప్రథమావిభక్తియగు 'డు' కాని యన్యము కాదు. అనగా మూండు, గోత్రుండు, ఇత్యాదితుండు అనురూపములు. తమిళభాషలో నిట్టి పదములను 'మూన్ఱు' 'గోత్రున్ఱు' అని యుచ్చరింతురు. ఎనిమిదవ, తొమ్మిదవశతాబ్దములలో నాంధ్రభాషకు తమిళభాషతోగల సంపర్కమువల్ల నిట్టిరూపము లేర్పడిఉండెను.[1] శకటరేఫము ఇంకొకహల్లుతో కలసినప్పుడు సాధురూపమును దాల్చుట ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయము కాదని తోచుచున్నది. కాని క్రమక్రమముగా ఆశాసనములందే

1. "The letter 'N' (not the dental 'N' but the final 'N' of the Tamil) a letter which is not found in Telugu, is often prefixed in Tamil to the ఱ for the sake of euphony, when the compound న్ఱ acquires the sound of న్డ్రి a sound of which the Tamil, like the language of Madagascar is exceedingly fond. In another class of words the 'N' which is fixed to ఱ is radical and should be followed by ట according to rule; but ఱ is suffixed to 'N' instead of 'd' in consequence of which న్డ్రి is substituted for న్ఱ. మూన్ఱు - మూన్డ్రు; ఒన్ఱు - ఒన్డ్రు"

Caldwell, Page 145.

సంశ్లేషములో లఘురేఫమె ఉపయోగింపబడినది. ఉ॥ చేబ్రోలు-చేబ్రోలు. ఇక ఈఅక్షరముయొక్క ఉపయోగ తత్త్వచర్చ విరమించి మఱియొక అక్షరముయొక్క ఉపయోగ బాహుళ్యమునుగూర్చి చర్చింతము.

ళ

ప్రాచీనశాసనములలో 'ళ' విస్తారముగా ఉపయోగింపబడినది. ఇది ముఖ్యము గా బహువచనమునందు గన్పట్టుచున్నది: ఉ॥ మహానదియుళ్; మహాసద్దవుళ్; కొడుకుళ్; సంవత్సరంబుళ్; గవిలళు; ఊరిస్వామిుళ్; అనగా మనమిప్పుడు బహుత్వమందు 'ల' కారమే ఉపయోగించుచోట ప్రాచీనాంధ్రభాషలో అలఘులకారము ఆదేశమైనట్లు తోస్తున్నది.

శ

ప్రాచీనాంధ్రశాసనములలో 'శ' కారమునకు బదులు 'స' కారమె తరుచుగా కనబడుతున్నది. ఉ॥ రస్మి-రశ్మి; అసేష-అశేష; సుద్ధ-శుద్ధ; అతిసయ-అతిశయ; సతాధ్వరములు-శతాధ్వరములు.

అనునాసికములైన ఙమజణన అక్షరములు

ఇప్పుడాంధ్రభాషలో అనుస్వారము, అర్ధానుస్వారము ఉపయోగించెడి పదములలో పూర్వపుశాసనములలో సామాన్యముగా అనునాసికాక్షరములే వాడబడినవి.[1] క్రమక్రమముగా అనునాసికములకు బదులుగా సిద్ధపూర్ణ ముపయోగించబడినది. ఆపూర్ణమునకు పూర్ణాక్షరము ద్విరుక్తమయ్యెను.

ఉ॥ విజయచణ్డధామిని జగనొబ్బగణ్డణ్డహితఖణ్డనోద్దణ్డ దోర్దణ్డ మణ్డలుణ్డు
శా. ప. 70.

అయితే పది పదకొండవ శతాబ్దముల శాసనము లలోనే ఇట్టి విధి పాటింపని స్థలములున్నూ కలవు. దానికీ క్రింది ఉదాహరణము చాలును.

క॥ ధీరుండు గశ్యపగోత్రా
ధారుండు గుండిమడవిభుం డుదారుండు మదనా

1॥ ప్రిథమంబుణ్ణు (కేంము)
ప్రిథుపణ్ణరంగు (పండ)
గావిళ్ళిమెచ్చి (వించె)
సున్దరి మత్తేభసుందగమన (సుందరి)
} అద్దంకిశాసనము. (శా. ప_1) (శా. ప_8)